శ్రీ

# కర్ణసుందరి

శ్రీ బిల్హణ నాటిక కాంధ్రానువాదము

★

అనువాదకులు :

శ్రీ బిల్హణ విక్రమాంకదేవ చరితాంధ్రానువాదకులును

ఆంధ్ర బిల్హణ బిరుదాంచితులును

వనపర్తి సంస్థాన శాస్త్రులును

నగు

శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

మాదిరాజు విశ్వనాధరావు

★

1947



వెల రూ 1-0-0

# కర్ణసుందరి

శ్రీ బిల్హణ నాటికకాంధ్రానువాదము



అనువాదకులు :

శ్రీ బిల్హణ విక్రమాంకదేవ చరిత్రాంధ్రానువాదకులును

ఆంధ్ర బిల్హణ బిరుదాంచితులును

వనపర్తి సంస్థాన కవులును

నగు


## శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## మాదిరాజు విశ్వనాథరావు





1947




వెల రు 1-0-0



శిరోమణి
కప్పగంతుల
లక్ష్మణశాస్త్రిగారు.

మాదిరాజు
విశ్వనాథరావుగారు.

# తొలిపలుకు

శ్రీ బిల్హణకవి విక్రమాంకదేవ చరితాంధ్రానువాదమునకుఁబిదప నాకవి రచించినదియె యని ప్రశస్తిఁ గాంచిన యీనాటిక ననువదింపఁ బూనితిని. విక్రమాంకదేవచరిత శైలి కిది భిన్నమై వర్ణనములు మనోహరముగ నుండి రత్నావళీప్రియదర్శికల క్రమములో నిదియు నొక సలక్షణ మగు నాటిక యగుటవలన నాంధ్రదేశమునకుఁ దత్కవీంద్రుని చాతురినిఁ గల్పనాప్రౌఢిమను వెల్లడింపఁ గోరి దీనినిఁ దెనిఁగింప నుత్సుకుల మైతిమి.

ఈ నాటిక కొందఱి విమర్శకాగ్రేసరుల యభిప్రాయముప్రకారము శైలి మున్నగువానినిఁ బట్టి విక్రమాంకదేవ చరితముకంటెఁ బూర్వమే రచింపఁబడినట్లు కనఁబడుచున్నది. పంచాశికారచన యీ బిల్హణకవిదో కాదో యను సందియ మింతవఱకును విమర్శకుల హృదయములలో నిలిచియేయున్నది గాని దానివలెఁ గాక యీ కర్ణసుందరీ నాటికలో స్వయముగ బిల్హణుఁడు దాను రచించినట్లే వ్రాసికొని యున్నాఁడు. విక్రమాంకదేవ చరితములోఁ గడపటిసర్గములో బిల్హణుఁడు దన సంపూర్ణ జీవితము వ్రాసి యది తన కడపటి రచనగాఁ దెలియఁజేయుచు నీ కర్ణసుందరీ నాటికను గుఱించి ప్రశంసించనందునఁ గొంత సందియమున కవకాశము గలదు గాని కర్ణసుందరీ నాటికాంతమున గ్రంథప్రశస్తి పద్యములలో నొకటిగ విక్రమాంకదేవచరిత ప్రథమసర్గములోఁ గల యీ క్రింది శ్లోకముఁ గూర్చినందున నీ కృతిద్వయకర్త బిల్హణుఁడే యని నిస్సంశయముగఁ దేటపడుచున్నది.

శ్లో॥ సహోదరాః కుంకుమకేసరాణామ్, భవంతి నూనం కవితావిలాసాః
న శారదాదేశ మపాస్యదృష్టః, తేషాం య దన్యత్రమయాప్రరోహః॥
(వి. చ. సర్గ ౧.)

ఇక్కవి యీ నాటికయందుఁ దొలి నాంది జినస్తుతితో నారంభించినాఁడు. పిదప నితరదేవతా స్తుతియుఁ జేసినాఁడు. దీనినిఁ బట్టి యక్కాలమున నేతత్కథానాయకుఁడు జైనమతాభిమానుఁడై యుండ నొప్పు నని తోఁచెడిని. పిదప నిక్కవి శ్రీ పార్వతీవర ప్రసాద లబ్ధకవితా

మహాత్త్వముఁ గలవాఁడనని చెప్పికొని తన యిష్టదేవములను స్తుతించి నందున నీతఁడు జైనమతస్థుఁడు కాఁడని తెల్లమగుచున్నది.

ఇందలి కథానాయకుఁడు చాళుక్యవంశ సంభవుఁడగు భీమదేవుని తనయుఁడని చెప్పఁబడినదే కాని నాయకుని పేరెచ్చటను గాన్పింపదు. ఇందలి యితివృత్తము చరిత్రాత్మక మగుటఁ బ్రఖ్యాతము. ఈకవి క్రీ. శ. ౧౧ వ శతాబ్దిలో అనహిల్లపురము రాజధానిగాఁ దూర్పు గుజరాతు దేశము నేలిన భీమదేవతనయు నాస్థానమున నుండి యీ నాటికను వ్రాసినట్లున్ను, దీనితర్వాతనే యితఁడు విక్రమాంకు నాస్థానమునకు వచ్చి యట విక్రమాంకదేవచరితమును వ్రాసినట్లున్ను బ్ర॥ వే॥ మానవల్లి రామకృష్ణకవి ఎం. ఏ. గారు సెలవిచ్చినారు.

ఇది దశరూపకములలో మూర్ధన్యము లగు నాటక ప్రకరణము లకు సంబంధించిన నాటిక. నాటికాలక్షణమును శ్రీ భరతముని తన నాట్యశాస్త్రములో నిట్లు నిర్వచించినాఁడు.

శ్లో॥ అనయోశ్చ (నాటకప్రకరణయోః) బంధయోగాత్
అన్యోభేదః ప్రయోక్తృభిః కార్యః
ప్రఖ్యాత స్త్వితరోవా నాటీ సంజ్ఞాశ్రితే కావ్యే
స్త్రీప్రాయా చతురంకా లలితాభినయాత్మికా సువిహితాంగీ
బహుగీత నృత్తవాద్యరతి సంభోగాత్మికా చైవ
రాజోపచారయుక్తా ప్రసాదన క్రోధదంభ సంయుక్తా.

( నా. శా. ౧౮ అధ్యా. )

రసభావాలంకారాలంకృతమై గంభీర భావవిలసితమై సలక్షణమైన యీ మహాకవి నాటికను దెనిఁగింప సాహసించిన మే మెంతవఱకుఁ గృతార్థుల మైతిమో యిందుకు సహృదయుల హృదయములే ప్రమాణము. ఈ మా సేవ యాంధ్రసాహితీలోకమునకు నేకొంచె ముపకరించినను మేము కృతార్థులము. ఇందు మార్పఁదగిన యంశములను విద్వత్కవి తల్లజులు దెల్పినఁ గృతజ్ఞులము.

ఈ గ్రంథ ముద్రణమునకు ప్రూఫు దిద్ది మాకు సాయమొనర్చిన విద్వచ్ఛిరోమణి బ్ర॥ వే॥ కేశవపంతుల వెంకటనరసింహశాస్త్రి మిత్ర వరులకును, ఈ యనువాదమునకు మమ్ముఁ బురికొల్పి మూలగ్రంథమిచ్చిన

శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్. గారికిని, మేము వేడిన తోడనే వెనుదీయక మాపై వాత్సల్యముచే నీ యనువాదమునకు విపులమగు పీఠిక వ్రాసి యిచ్చిన బ్రహ్మశ్రీ వేదము కుటుంబ సీతారామ భట్టాచార్యులు ఎం. ఏ. గారికిని, నేతద్గ్రంథ ముద్రణమునకు ధనసహాయము చేసి తమ యసమాన భాషాభిమానమును నౌదార్యమును ప్రకటించిన శ్రీ ఆత్మకూరు సంస్థానము దివాన్ శ్రీ నరసింగరావుగారికిని మా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము.

ఇట్లు,

**అనువాదకులు**

# పరిచయము

బిల్హణుడు అను నామమే యాయన కాశ్మీరదేశవాసియని చెప్పుచున్నది. ఈయన గొప్పకవి. ఈయన కాశ్మీరమును వెడలి యనేక స్థానములలో కవిగా వరలెను. మొదట నాయన యయోధ్యలో కొంతకాలముండి చేదిదేశమను నామాంతరముగల దాహాలదేశమునకు వచ్చి యచ్చటి యాస్థానమున కొంతకాలముండెను.

ప్రాచీన చాళుక్యరాజ్యము రాష్ట్రకూటులచే విచ్ఛిన్నము చేయబడిన వెనుక చాళుక్యు లచ్చటచ్చట చిన్నరాజ్యములకు పాలకులైరి. అట్టి చాళుక్యుల వంశ మొకటి ఘూర్జరాపర నామముగల లాటదేశమున నేలుచుండెను. ఈ వంశమునకు మూలరాజను నాయన మూలపురుషుడు. ఆ తర్వాత చాళుక్యరాజులలో మొదటివాడగు తైలపుడు రాష్ట్రకూట రాజగు కక్కలుని నోడించి మరల చాళుక్య సామ్రాజ్యమునకు మూల పురుషుడయ్యెను. ఈ తైలపుడు తన సామ్రాజ్య విస్తృత కార్యములలో లాటదేశము నేలుచున్న మూలరాజునోడించి సామ్రాజ్యాంతర్భాగము చేయుట యొకటి. మూలరాజునకు అణహిళ్ళపురము రాజధానిగా నుండెను. తైలపుడు అణహిళ్ళపురమును గెలచిన వెనుక తర్వాతిరాజులంత పరాక్రమవంతులు కాకపోవుటచే మరల లాటము స్వతంత్రమైనట్లు కన్పట్టును. ఆహవమల్లుని కాలమువరకు స్వతంత్రముగానే యుండిపోయెను. ఈ మధ్యకాలమున , ననగా క్రీ. శ. 973 నుండి 1040 వరకు నచ్చట కొందరు రాజులేలిరి. వారిచరిత్ర మనకప్రస్తుతము. క్రీ. శ. 1040 వ సంవత్సరప్రాంతమున నచ్చట భీమదేవుడను రాజేలుచుండెను. ఆహవమల్లుడు భీమదేవునోడించి మరల లాటదేశమును వశపరచుకొనెను. భీమదేవుని కుమారుని కాలమున బిల్హణుడు లాటదేశముననే అణహిళ్ళపురమున నాస్థానకవిగా నున్నట్లు కన్పట్టును. భీమదేవుని కుమారుని పేరు మనకు తెలియదు. కవియు దానినియ్యలేదు. ఈ విషయము నాటకమునందలి,

"భీమతనయుండౌరా కథానాథుఁడా"

అను పద్యభాగము తెల్పుచున్నది.

.. విక్రమాదిత్యుడను నపరనామముగల విక్రమాంకదేవుడు ఆహవ మల్లుని కుమారుడు. ఈయన, తండ్రియగు ఆహవమల్లుని కాలమున సామ్రాజ్యోత్తరభాగమును తండ్రికి ప్రతినిధిగా నేలుచుండెను. అప్పుడు బిల్హణునితో పరిచయమేర్పడి యుండును. క్రీ. శ. 1076 లో తాను చక్రవర్తి యైనతర్వాత బిల్హణుని తన యాస్థానమునకు పిలచి యాయన చే విక్రమాంకదేవచరితమును రచియింపించెను.

తరువాత బిల్హణుని తనరాజ్యమున విద్యాపతిగా నొనర్చి గౌర వించెను. రాజు బయటకు వెడలినపుడు బిల్హణు డాయనముందు గజా రూఢుడై వెడలుచుండువాడట! కొంతకాలమునకు కవిశత్రువుల కుతంత్రములచే విక్రమాంకదేవుడు బిల్హణుని సర్వస్వమును గొని యాయ నను వెడలనడచెననియు, తరువాత మాళవదేశమున నప్పుడేలుచున్న హర్షుడాయన కాశ్రయమును సంతోషముతో నిచ్చినట్లును రాజతరం గిణివలన తెలియును.

బిల్హణుడు రెండు గ్రంథములను రచించెను. వానిలో నీ నాటిక యొకటి. దీనిని లాటదేశమున అణహిళ్ళపురముననున్న కాలమున రచిం చెనని మున్నే చెప్పియుంటిని. ఆ విషయము నాటికయందలి,

"ఈ యణహిళ్ళపట్టణాలంకార భూతమగు శాంత్యుత్సవ దేవా లయమున"

అను ప్రస్తావనాభాగము స్పష్టపరచుచున్నది. కావున నీనాటిక యాయన మొదట రచించిన గ్రంథమని గట్టిగా చెప్పవచ్చును. రెండ వది విక్రమాంకదేవ చరిత్రము. చారిత్రకముగ నది మిక్కిలి విలువగలది యని చారిత్రకులచే కొనియాడబడుచున్నది. ఈ నాటిక భాషాంతరీక రించిన కవిద్వయమే కావ్యమునుకూడ భాషాంతరీకరించుట ముదా వహము. కావ్యముయొక్క ప్రశస్త్యాదులు మనకిట నవసరములేదు.

నాటికయందు భీమరాజపుత్రుని ప్రశంస యుండుటచేతను, భీమ రాజు విక్రమాంకదేవుని తండ్రియగు ఆహవమల్లునికి సమకాలికుడగుట చేతను, విక్రమాంకుడు క్రీ. శ. 1076 న సామ్రాజ్యపదవికి వచ్చియుం డుటచేతను, నీ నాటిక 1060 ప్రాంతమున బిల్హణుడు రచియించి యుండ వలెను. మరియొక విషయము. విక్రమాంకదేవుని తండ్రియగు ఆహవ

మల్లుని విజయయాత్రలో తండ్రికి విక్రమాంకదేవుడుకూడ సాయముగా నున్నట్లు తెలియును. కాని ఆహవమల్లుని యనంతరము విక్రమాంక దేవుని యన్నయగు సోమేశ్వరుడు దాదాపు ఆరేడు సంవత్సరములు రాజ్యము చేసినట్లు చరిత్రాధారములు కలవు. ఈ సోమేశ్వరుడు పరాక్రమవంతుడు కాకపోవుటచేతను, ప్రజలను పీడించుటచేతను, రాజ్యమును కోల్పోయి విక్రమాంకదేవుడు చక్రవర్తి యయ్యెను. కావున భీమదేవ తనయుడు అణహిల్లపురమున క్రీ. శ. 1080 కు పూర్వము రాజ్యము చేయుచుండవలెను.

ఆహవమల్లుడు రాజ్యమునకు వచ్చిన వెంటనే తరములనాటి శత్రువులగు చోడులపై మొదట వెడలి, తరువాత మాళవదేశమును జయించి, యనంతరము కొంతకాలమునకు చేదిదేశాధిపతియగు కర్ణుని, నాయనకు బాసటగావచ్చిన భీమరాజును నోడించెను. క్రీ. శ. 1040 సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన ఆహవమల్లునికీ కార్యములన్నియు దాదాపు 15 సంవత్సరములు పట్టియుండును. అనగా భీమరాజు క్రీ. శ. 1055 ప్రాంతమున నుండియుండును. తరువాత నాయన కుమారుడు రాజ్యము చేయగా, నాయన కథానాయకుడైన యీ నాటిక క్రీ. శ. 1070 కిని క్రీ. శ. 1080 కిని మధ్య రచితమై యుండునని చెప్పనొప్పును. భీమరాజు తనయునకు సంపత్కరుడు మహామాత్యుడని ప్రస్తావనవలన తెలియుచున్నది.

భీమదేవుని సమకాలికుడగు నొక కర్ణరాజు కలడు. ఈయన పశ్చిమవయసున కర్ణాటరాజగు జయకేశియొక్క కుమార్తెయగు మామల్లదేవిని వివాహమాడినట్లును, నీ యుదంతమును కీర్తించుటకై బిల్హణుడు కర్ణసుందరీ నాటికను వ్రాసినట్లును చెప్పుదురు. కర్ణసుందరి యను నామకరణ మీయూహకు సహకారి యగుచున్నది. కాని నాటకమును బట్టి భీమరాజపుత్రుడు కథానాయకుడని చెప్పియుండుటచే కర్ణరాజు కథానాయకుడు కాడనుట స్పష్టము. మరియు నాయిక నామధేయమే కర్ణసుందరి యని యుండుటచే, కర్ణరాజు వృత్తాంతమే తొలగుచున్నది. ఇంతేకాక భీమదేవ తనయుడు కథానాయకుడగుటచే కర్ణరాజుతర్వాత కొన్నిసంవత్సరముల కీ నాటకము రచింపబడినట్లు చెప్పవలెను. కాబట్టి

కర్ణరాజ వృత్తాంతమునకును నీ నాటకమునకును సంబంధము చెప్పుట పొసగకున్నది.

బిల్హణుడు లాటదేశము చుట్టునున్న రాజ్యములను బాగుగా నెరిగి యున్నట్లు నాటికయందు దృష్టాంతములు కలవు. ఘూర్జర, మేదపాట, మాలవ, హూణ స్త్రీల "కామశ్రీమవాః కణంబులు తోలంగన్ వీచెడున్ దెమ్మెరల్" అని వ్రాసినాడు. ఘూర్జరమునకు, మేదపాట (రాజస్థాన) మాళవ దేశములు సరిహద్దురాష్ట్రములు. ఆకాలమున కింకను హూణ స్త్రీ లక్కడక్కడ నున్నట్లు మన మనుకొనవలెను. బిల్హణుడు మేదపాట మాళవా స్థానములను కూడ నెరిగియుండు ననుకొనుటలో తప్పేమియు లేదు.

గ్రంథపీఠికనుబట్టి బిల్హణుడు "సాహిత్యోప నిషన్నిషణ్ణమతి" యని తెల్పుకొని యున్నాడు. ఇందువలన నీయన వేదాంతశాస్త్రము నందును నభినివేశము కలవాడని తెలియును. సాహిత్య శాస్త్రము నీయన యాపోశనము పట్టినట్లీయన రచించిన రెండు గ్రంథములే సాక్ష్య మిచ్చుచున్నవి. ఈయన స్వదేశమగు కాశ్మీరము సాహిత్య శాస్త్రము నకు పుట్టినిల్లనక తప్పదు. శ్రీ శంకరులుగూడ కాశ్మీరము వెడలి సర్వజ్ఞ పీఠము నలంకరింపవలసి వచ్చెను.

బిల్హణుని కాలమున కింకను జైనమతమా ప్రాంతమున కొంత ప్రచారమున నున్నట్లు స్పష్టము. రాష్ట్రకూటుల కాలమునాటికే మరల వైదికమతము తన యథాస్థానము నలంకరించెను. కాని జైనమతము కూడ ఉన్నదనుట స్పష్టము. నాటికలోని ప్రథమశ్లోకము జిన మూర్తి యొక్క స్థితప్రజ్ఞత్వము నుగ్గడించుచున్నది. జిను డని విష్ణువునకును నామము కలదు. అయినను నచ్చటి "జినుడు" అను పదమునకు జినదేవు డనియే యర్థము చెప్పుకొనవలెను. "గిరివలెనిల్చు" అను పద్యభాగము తీర్థంకరాకారమును స్ఫురింపచేయుచున్నది.

బిల్హణుని కాలమున లలితకళలలో నభినివేశ మెక్కువగానున్నట్లు కానవచ్చును. ప్రస్తావనలో దాక్షిణాత్య నటీప్రశంస కలదు. ఆ కాల మున దాక్షిణాత్యులు నాట్యకళయందు ప్రవీణులగుటచే రాజాస్థానము లలో వారి కాదరముండెడిది. అనర్ఘరాఘవాది నాటకములలో కూడ

దాక్షిణాత్య నటీప్రశంస కలదు. రాజసభలలో నృత్తమొక ముఖ్యాంశము. మరియు చిత్రలేఖనమునకు కూడ గొప్ప స్థానముండెడిది. నాట్యమనుటలో గానము, కవితయు నిమిడియున్నవి. ఈ యంశములన్నియు భాసకాలమునుండి కూడ అనువృత్తములుగా వచ్చుచున్నట్లు కన్పడును.

బిల్హణునికి వెనుకనుండిన నాటకకర్తల గ్రంథములు బహుళ ప్రచారములో నున్నట్లు మన నాటికవలన తెలియును. భాస, కాళిదాస, శ్రీహర్ష, రాజశేఖరుల నాటకములందలి చిహ్నములీ నాటికయందు స్పష్టము కాగలవు. అందును స్వప్నవాసవదత్తయు, మాళవికాగ్నిమిత్రమును కర్పూరమంజరీ విద్ధసాలభంజికలును నీ నాటికకు వరవడిగా నున్నట్లు పెక్కు దృష్టాంతములను చూపవచ్చును.

నాటికకును నాటకమునకును నొక్క యంకసంఖ్యయందే భేదమున్నది. మిగిలిన లక్షణములలో రసమునుగూర్చి యెంతమాత్రమును భేదము కానము. నాయకుని విషయమున వత్సరాజు, అగ్నిమిత్రుడు, మొదలగువారెట్టి నాయకులో, యిందలి నాయకుడును నట్టివాడే! ఒక వైపున స్త్రీలోలుడయ్యు, మరియొక వైపున తన సేనాబలముచే పరరాజ్యములను గెలచినవాడే! వాసవదత్తా మాళవికాగ్నిమిత్ర రత్నావళీ కర్పూరమంజరుల యితివృత్తము లెంత ప్రఖ్యాతములో, యిందలి యితివృత్తమును నట్లే! నాటిక సట్టకమంత ప్రాకృతభాషామయము కాదు. నాటిక నాటకముయొక్క సూక్ష్మరూప మనవచ్చును. ఇట్లే ప్రకరణాదులు.

క్లుప్తముగా నిందలికథ యిది. చాళుక్య భీమకుమారుడు చక్రవర్తి యగునని చెప్పిన జ్యోతిషమున కనుగుణముగా సేనాపతులను దేశములపై కంపును. కర్ణసుందరి యను విద్యాధరబాలిక యంతఃపురమున నుండును. రాజు తన స్వప్నమందామెనుచూచి విదూషకునితో చెప్పును. తరువాత యామె చిత్రమును చూచును. చూచుచుండగా దేవి వచ్చి రహస్యము గుర్తెరుగును. ఎత్తుపై యెత్తులు జరుగును. దేవి యొకమారు కర్ణసుందరీ వేషమును ధరించి రాజును మోసగించును. దేవి బంధువగు నొక బాలకుని కర్ణసుందరీ వేషమును ధరింపజేసి యంతఃపురమునసుంచి, నిజమైన కర్ణసుందరిని రాజుతో కలియు తంత్రము మంత్రి నిర్వర్తించును.

దేవి కర్ణసుందరీ వేషధారియగు బాలకుని రాజున కర్పింపబోగా నామె నిజమైన కర్ణసుందరిగా తేలును. ఇంతలో రాజునకు యుద్ధ విజయవార్త వచ్చును. దానితో దేవి సంతసించి వివాహమున కొప్పుకొనవలసి వచ్చును.

రాజు చక్రవర్తి యగునను జ్యోతిషము, నాయిక కలలో కన బడుట, చిత్రమునందు నాయకుడు నాయిక ప్రతికృతిని దర్శించుట, దేవి అసూయ, రాజును దేవియవమానించుట, పిదప పశ్చాత్తాపము, ఇంతలో విజయప్రాప్తి, సంతోష చిహ్నముగా రాజునకు సమర్పించి సఖ్యము నెరపుకొనుట మొదలగునవి దాదాపు భాస, కాళిదాస, శ్రీహర్ష రాజ శేఖర కవుల రూపకములకు సమాన విషయములు. వారి రూపకముల యందు ప్రతిభగాని, విశిష్టతగాని, యిందు లేదనియు, నిది వాటి ప్రతి బింబము మాత్రమే యనియు చెప్పక తప్పదు. కాని బిల్హణుని వాక్య మాత్రము రసవంతమై తత్తద్వర్ణనముల కుచితమై యొప్పారుచున్నది. ఈ నాటిక యొక్కటియేకాదు. తరువాత వచ్చిన నాటికలన్నియు వెనుకటివాని శక్తి రహిత ప్రతిబింబములనియే చెప్పవలెను. కర్ణసుందరీ నాటికయందుకంటె విక్రమాంక దేవ చరిత్రమునందు కవి తన కవితా సామర్థ్యమును చూపియున్నాడు. ఇది యాయన ప్రథమ కృతియని వెనుక మనవిచేసియుంటిని.

కథా సంవిధానమునందేగాక వర్ణనా విషయము, సంభాషణా వాక్యములు మొదలగువాని యందుకూడ వెనుకటికవుల వాక్యముల ప్రతి ధ్వనులు వినబడుచుండును. కొన్ని యుదాహరణముల నిత్తును.

"తుదిన్, దరుణీరత్నము మెల్లనన్దిరిగి" (అం. 1 పుట 17.)

శాకుంతలములో శకుంతల వస్త్రము కంటకములకు తగుల్కొనె నను మిషచే దుష్యంతుని వెనుకదిరిగి చూచును. ఇట్లే మాళవికాగ్ని మిత్రమందును కలదు.

"విరించి యేకరణి సూత్రించన్ సమర్థించునో" (అం. 1 పుట 17)

ఇది "నజానేభోక్తారం కమిహసముపస్థాస్యతివిధిః" అనుదానికి ప్రతిధ్వనికాదా?

"ఆ త్రైలోక్యసుందరి యిచ్చటనే కనుచూపుమేరలో............
నుండగలదు." (అంక. 1 పుట 20)

ఇది విక్రమోర్వశీయములోని విదూషకుని వాక్యమునకు ప్రతిధ్వని యని వేరే చెప్పబనిలేదు.

ఒకచోట భవభూతి వాక్యప్రతిబింబము కాననగును.

"బింబంబుగ, ప్రోతగా ఘటితగా," (అం. 2 పుట 35)

ఇది "లీనేవ, ప్రతిబింబితేవ" అను వాక్యములను స్ఫురింపజేయుట లేదా?

ద్వితీయాంకమున నాయికా నాయకుల కేకాంతము లభింపజేయుటకై విదూషక చేటులు వెడలిపోదురు. మాళవికాగ్నిమిత్రాదులగు కాళిదాస నాటకములయందలి కథా సంవిధాన ప్రతిబింబ మిదియనజెల్లును.

విరహలేఖా ప్రసంగముకూడ విద్ధసాలభంజికాదుల యందలి వాని ప్రతిబింబమే ననవచ్చును.

"ఆయతాక్షము" "ఆకేకరాక్షి" మొదలగు పదములుకూడ ప్రతిధ్వనులే యగును.

"వైవాహిక హోమధూమకలనా మీలత్కపోలాస్య" మను పద్యభాగము శ్రీహర్షుని ప్రియదర్శికయందలి "ధూమవ్యాకులదృష్టిః" అనుదాని ప్రతిధ్వనిగనే కన్పట్టును.

విదూషకుని స్వస్తివాచకములుకూడ నీసందర్భమున నుల్లేఖింపవలసిన విషయములు.

ఈవిధమున ననేక ఛాయలు కాననగును.

కొన్ని పాత్రనామములలోకూడ యిట్టి స్ఫురణమునే కలుగచేయుచున్నవి. ప్రాచీన నాటికలయందలి యౌగంధరాయణ, భాగురాయణుల కుద్దిగా నిందు బాదరాయణుడున్నాడు. ఒకచేటి వకుళావళియను నామముకలది. మాళవికాగ్నిమిత్రము నందలి వకుళావళిక కీమె ప్రతిబింబము.

అక్కడక్కడ బిల్హణీయమని పిలువబడు చౌరపంచాశికయొక్క ఛాయలుకూడ కన్పట్టుచున్నవి. రెండుదాహరణము లిచ్చెదను.

"జీవనములన్ రక్షింప మందయ్యోడిన్" (పుట 52)

ఇది "ఇందీవరాక్షితవ" యను శ్లోకమును స్ఫురింపచేయుచున్నది.

"దానిలోపలిగలనల్పు దైవవిధిబాసెనో, వారిభవాకరామృతా మల నవ వీచిఘాతమయి మానెను" (పుట 31)

ఇందు "అంకంకేపిశశంకిరే" అనుదాని యందలి ఛాయ కలదు. ఇంతమాత్రమున దాని కర్తృత్వము బిల్హణుని కంటకట్టుట నా యాశయముకాదు.

మొత్తమున నీ నాటిక శృంగారరస ప్రధానమై సహృదయుల కానందము కల్గించుననుటలో నెట్టిసందియము లేదు. భాషాంతరీకరణముకూడ కవిద్వయము బాగుగా నిర్వర్తించినారనియే చెప్పనగును. బిల్హణునిది ద్రాక్షాపాకముకాదు. కదళికిని నారికేళమునకును మధ్య నుండును. భాషాంతరీకరణమును నట్లేయున్నది.

ఇంతటితో నీ నాటికను పాఠకులకు సమర్పించుచున్నాను.

నాంపల్లి, హై. ద.
14-3-47.

సహృదయుడు,
**కురుగంటి సీతారామభట్టాచార్యులు,**

# కర్ణసుందరి

## దేవతాస్తుతి

ఉ॥ శ్రీసతి తన్ను మేలమునఁ జేరి యిదేల? యధిప? సురారులన్
వేసము మారి మోసమున బీర మడంతువు క్షాత్రమానా! నీ
. వేసవి శౌరి వాదు వన దృప్తరిపుక్షతి కిద్ది ధర్మమ్మమా
నోసుమగాత్రి! యంచు మద మాన్చు ముకుందుఁడు బ్రోచు నీకృతిన్

మ॥ కలిబన్నంబుఁ దొలంచఁగా మనమునన్ గాంక్షించి నిచ్చల్ ధరా
తల వైకుంఠము వేంకటాద్రిపయి భక్తవ్రాతముల్ గొల్వఁగా
నెలవై యుండి యభీష్టముల్ కరుణతో నిండారఁ బూరించు వే
ల్పుల మిన్నన్ భజియింతు మంచితవచస్స్ఫూర్తిన్ బ్రసాదింపఁగన్

ఉ॥ ఆకృతు లందు గర్భభవమై నరవర్తన డాయు లోపముల్
లేక, స్వయంబుగా నిల సిలింపరిపుక్షతికై జనించి, తాఁ
బ్రాకృతలీలఁ జూపి, యనపాయతఁ గూర్చు నృసింహమూర్తి మా
వాకులయందు నిల్పి యనవద్యకవిత్వమహత్త్వ మిచ్చుతన్

## కవిప్రశస్తి

కం॥ మునునా యిలువేల్పులఁ ద
త్సనామ పితరులను గుశికసద్వంశజులన్
మనమునఁ గవిలక్ష్మణుఁడన్
బ్రణుతించెద శ్రీనివాస పద్మావతులన్.

తే॥ గీ॥ చెలఁగి గృహదైవతంబైన శ్రీనృసింహుఁ
గొలిచి తల్లిని లక్ష్మమ్మ గురువు రామ
రాయుఁ గౌండిన్య గోత్రు సంభ్రమముమీఱఁ
దొలుత నీకృతి విశ్వనాథుఁ డను దలఁతు.

ఉ॥ భారతి సేవసేయుటకుఁ బాటుపడం దలపెట్టి యొంటిగా
దారులఁబట్టి పోవుచుఁ బదంబుల సంగమదేశమందు వ్యా
పారులుగూడి యేకముగ వర్తకమున్, జయశీల మానటుల్
దీరుచుమాడ్కిఁ గూడి విశదీకృత సౌహృద మేర్పడంగ దు
ర్వార విధాశ్లథీకృత సుబంధుర పూర్వకవిత్వ ధోరణిన్.
సారరసాద్యలంకరణ సంగతిగా నొనరింపఁ గోర్కెదై
వారఁగ విక్రమాంకకథఁ బ్రోథిత లక్ష్మణ విశ్వనాథులన్
ధీరుల మేముగూర్చితిమి తెన్గున నాటికఁ గర్ణసుందరిన్.

## సహాయకప్రశంస

శా॥ రామద్రోణ ముఖద్విజాత్త పరమబ్రాహ్మ్యంబు క్షాత్రంబు నీ
భూమిన్ సాకృతి నేకదేశముగ విస్ఫూర్తిన్ గడున్ గాంచు నా
భూమీనిర్జర వంశమం దరుదె సంబోధించి యార్వేల వం
శామాత్యప్రజ మగ్రయాయిగ మహీశః ప్రాధిఁ గీర్తింపఁగన్.

శా॥ త్రైలింగ్యావని రెడ్డిరేండ్లు వెలమల్ ధాత్రిన్ గడున్ మించుటల్
వాలాయమ్ముగ వారిసాయము వహింపంగల్గియే కాదె యా
మేలున్ గాలవిపర్యయంబున ధనామేయాంధకారమ్మునన్
భూలేఖేంద్రులు విస్మరింప నెటు పోవున్ దన్నిసర్గోన్నతుల్.

మ॥ మును రాజుల్ సతతంబుఁ గయ్యములలోఁ బోరంగనై పాలితా
వని నిల్పోపనియప్డు కృష్ణకు నుదగ్భాగంబు తామాక్రమిం
పను యత్నించుచు ముక్కరాన్వయజు లాహ్వానించి రెవ్వని నా
ఘనుఁడౌ కొండయమంత్రిశేఖరు గుణోత్కర్షంబు సామాన్యమే?

శా॥ ఆ రెడ్డీంద్రులకున్ హితంబుమెయిఁ గొండార్యుండుఁ దద్వంశజుల్
పారంపర్యముగా నమాత్యు లగుచున్ బ్రాజ్యత్వమా పాలనా
ధౌరంధర్యమునన్ సహాయు లగుచున్ దద్దన్ బ్రథన్ గాంచి ర
వ్వారిన్ దా మరపించె గూర్మయ గుణభ్రాజిష్ణుఁ డూర్జస్వియై

వ॥ అట్టి గుణోదారుండగు కురుమయ్యకు వెంకన్న సింగన్న యను
నిర్వురుసుతు లుదయించిరి. అందు

కం॥ కూర్మామాత్య తనూజుఁడు
నిర్మలమతి సింగమంత్రి నృపనీతికళా
మర్మజ్ఞుఁ డయ్యె మంత్రిగ;
వర్మంబై ముక్కరాన్వవాయనృపునకున్.

చ॥ తనసచివుండునై తనకుఁ దద్దహితంబునుగోరి శత్రుశా
సనమును రాజ్యపాలనము సల్పునెడన్ సయిఁదోఁడుగా మెలం
గినఁ గని మెచ్చి యాత్మపురికేవల సోమనృపుండు భూమిసీ
మను నియమించి సింగనకు మాన్యముగా నొసఁగన్ గ్రహించుచున్

కం॥ జనముల జతగూర్చి యటన్
మనుకుల నొనరించి తనదు నామమునన్ సిం
గనపేట యనన్ నిలిపెను
ఘనవనవాపీతటాక గణనీయముగాన్.

గీ॥ శిష్టుఁడగు వెంకనయు నరసింగరాయుఁ
డనఁగ సింగనతనుభవు లవనిజాని
కార్యనిర్వహణక్షమాఖర్వు లఖిల
మంత్రితంత్రజ్ఞు లలరి రిమ్మహి నుతింప.

కం॥ సుతులిర్వురు వెంకనకున్
శితబుద్ధులు సింగనయును చినసింగనయున్
జితగురువులు మంత్రిజ్ఞత
నతిచతురులు వాడమి రందు నాద్యుఁడు హితుఁడై

కం॥ తనజీవితంబు దాఁకను
జనపాలాస్థానమందు సచివుఁడయి యశో
ధన శేషుఁడయ్యెఁ దమ్ముఁడుఁ
దనయుఁడు దనకన్న మున్న తరలఁగ దివికిన్.

కం॥ నరసింగరాయఁ డచ్చము
తరుణీరత్నంబునందుఁ దనయులఁ గనియెన్
గిరిధైర్యు గోపనార్యున్
నరనుతగుణు బాలకృష్ణు నయజితధిషణున్.

వ॥ అందగ్రజుండు,

చ॥ దినదినవర్ధమానమగు ధీయుతిఁ దీరి కలాతతిన్ రహిం
చినఁ గని భూమిజాని తనచెంగట నొక్కనియోగమందు ని
ల్పినఁ దనకార్యమందుఁ గడుఁ బ్రజ్ఞ మెలర్పఁగ జాగరూకుఁడై
జనపతియున్ జనంబులును సంతసమొంతయు నొంద మించుచున్

కం॥ తనదేవి శేషమాంబా
వనితామణియందుఁ గాంచె వనధిగభీరున్
ఘనసుగుణగణాన్వితు స
జ్జననుతు నరసింగరాయు సౌజన్యయుతున్.

చ॥ అల నరసింగరాయబుధుఁ డాంధ్రము నాంగ్లముఁ బారసీక మొ
జ్జలకడ నన్యదేశముల శ్రద్ధగ నేర్చి కడుం బ్రవీణుఁడై
కులమున వన్నెకెక్కి యనుకూలుఁడు నాఁగఁ బ్రసిద్ధిఁ గాంచి తా
నలఘుమతిప్రశస్తి వ్యవహారవిదుండనఁ గీర్తిఁ గాంచుచున్.

కం॥ ఘనుఁ డా రసికుఁడు కవితా
వనితారత్నమున కధిక వాల్లభ్యమునన్
గనకనికేతన మొనరిం
పను దలఁచుచునుండి యొక్కపరి మాత్రోడన్.

చ॥ పనుపడి ముచ్చటించి హితబాంధవు లీరఘు తెన్గుబాసలో
ఘనమగు ప్రౌఢబంధమున గ్రంథములన్ రచియించి యాదటన్
దెనుఁగుపొలంబునం గల సుధీనిధులన్ వనియించినార లం
చని వచియించి సారకవితాదర మేదురధీరధోరణిన్.

కం॥ కృతిమూలంబు నిల సం
స్తుతికీర్తులు సప్తసంతతులలోనన్ సం
గతమగు నని బుధు లన మీ
కృతులకుఁ దోడ్పాటుసేయఁ బ్రీతి వొడమెడున్.

మ॥ ప్రియ మొప్పారఁగ నాకు మీకృతులలో శ్రీవిక్రమాంకావనీ
ప్రియుచారిత్రముఁ గర్ణసుందరికథన్ విన్పింపఁగా వీనువిం
దయి తత్కావ్యయుగంబునం దొకటి మిమ్మాశించితిన్ ముద్రణ
క్రియ సేయింపఁగ నాసహాయమున కంగీకారమున్ జూపుఁడీ.

కం॥ అని పలికిన మామిత్రుని
వినయవచోరచన కాత్మఁ బ్రియమొందుచు మే
మనుపమసౌహృదమున నా
యనఘుని సాహాయ్యమూన నౌ చిత్తములన్.

చ॥ నవకవు లెందఱో దినదినంబును స్వేచ్ఛ మెయిన్ రచించుటన్
నవకముదప్పెఁ బూర్వకవనంబు ప్రబంధపు ఫక్కిఁచిక్కెఁ దా
నవకలనంబు భారతికి నాఁటి రసోజ్జ్వల పుష్టిలేమి, మా
నవ, కడుమించు నీయవగుణాలని మిత్రులు ప్రోత్సహించినన్.

చ॥ కవితిలకుండు బిల్హణుఁడు కావ్యముగా సురభాషవిక్రమాం
కవిభుచరిత్రమున్ రసవికాసము లుల్లసిలన్ రచించె, స
త్కవికుల మాత్మమెచ్చఁగ విదర్భజరీతిఁ బ్రసన్నశైలిఁ, గా
కవినికరంబు తల్లడిలఁగా నిలఁగా నిల నెల్లకాలమున్.

తే॥ గీ॥ కర్ణసుందరియను నాటికన్ రచించెఁ
దదను నాబిల్హణుండె కోవిదులు మెచ్చ
నీకృతిద్వయిఁ దెనుఁగునం దేము ప్రౌఢ
బంధమునఁ గూర్చితిమి ప్రబంధములు గాఁగ.

వ॥ మా మిత్రుని ప్రార్థనఁబట్టి ముద్రింపించుటకు,

చ॥ తలఁచి లఘుప్రకారముగఁ దత్కులవర్ణన సల్పి తద్యశం
బిల నిలఁ గర్ణసుందరి సమిద్ధకృతిన్ దదభీష్టభంగిమైఁ
దొలిపలు కొనటుల్ వరుసతోఁ గుదిరించితి మిత్రకీర్తిన్ బ్రవ
ర్తిలుఁ గృతియున్ సహాయకునివృత్తము నాగవిచంద్రతారమున్.



# కర్ణసుందరి (నాటిక)

## నాంది

చ॥ అరయవొ నీకుఁ గా బడలునంగము, నన్నిరసింపఁబోల దే
యురవున స్త్రీవ్యథాకరుఁడ వొందెదుసౌఖ్యము? కౌఁగిలింపు, బం
గరు జిగియంగముల్ దవులఁగా, ననియచ్చరపిండువల్కఁగ
గిరివలెనిల్చు నాజినుఁడు క్షేమముఁ గూర్చుచు మిమ్ముఁ బ్రోచుతన్.

మఱియు,

మ॥ హరుఁడు ద్ధూళిన మైనవెంబడిన, సంధ్యార్చావిధిన్ దట్టునే
కరతాలత్రయి శ్రోత్రగోచరముగాఁ, గామూర కేకేంద్ర, మ
గ్గిరిజాదృష్టిమదింపఁ, గేకలిడుచున్ గ్రీడించు, మీరాకన్ నిరం
తరమున్ దన్నినదత్రయం బడరు సంతాపత్రయిన్ బాపుతన్.

మఱియును,

చ॥ ఇది గళరేఖ మోము నెలకింపగు, నీగళరేఖకున్ గుచా
స్పదరమయొప్పు, నాకుచవిభాతికి నుద్దియకౌనటంచు నీ
చదురునఁ బాలవెల్లివరుసన్ బ్రభవించురమన్ గుతూహలం
బెదఁగదురంగఁ గాంచుహరిదృష్టులు ప్రేముడిఁ బెంపుఁగాంచుతన్.

నాంద్యంతమున

సూత్రధారుఁడు:- ప్రభాతమగుచున్నది

చ॥ అదె యపరాద్రిశృంగతలమందిన చంద్రము బింబమస్తమున్
గదియు, వియోగినీజనము గాసిలిపల్కెడు దూఱులన్ వలెన్;
గదియు సురేంద్రదిక్కున నొకానొక సాంధ్యవిలాస, మల్కమైఁ
బొదలు చకోరికాపటలిఁ బొల్పగుకన్నులకున్ సమానమై.

చ॥ నిలయచకోరికాళి తపనీయమయాలయజాలకాంతరం
బులఁబడు చంద్రికాసలిలముల్ గ్రహియించు శిలోంఛవృత్తి మైఁ
నులియని పావురాలగమినొప్పిన తల్పగృహంబులుల్ బ్రియుల్
కలిసి రతిశ్రముల్ సుఖముగా నిదురించు విధంబుచెప్పెదుల్.

చ॥ సురపతి దాడిమంబు పుష్పుఁజూపెను దూర్పున, నంతరిక్షముల్
తరువునఁ గుట్మలద్యుతుల తారకలుల్ నిగఁగోలుపోయె, నా
వరుణదిశాతటిల్ దుహినభానునిమూర్తియుఁ గాంచనయ్యెఁ, గ
స్తురి హరిణంబు నేత్రముల శోణతరుల్ సరియైనకెంజిగిల్.

(నేపథ్యాభిముఖముగా) ప్రియురాలా! రంగస్థలాలంకరణంబులు బాగుగాఁ గూర్పఁబడినవా? (యోచించి) ప్రియురాలు విముఖవలె నున్నది కారణమేమైయుండును (స్మృతినభినయించి)

మ॥ కనుఁగొంటిల్ నవయావనంబు, నకలంకంబౌ కలాసిద్ధిఁ బే
ర్చిన యొక్కర్తుక దాక్షిణాత్యనటి, నుర్వీపాలునాస్థానమం
దునటింపంగఁ, దదీయగోష్ఠిఁ గలయందున్ నేననల్ విన్నదై
మునుకొన్కింకను నాయెడల్ బ్రియప్రియంబుల్ వీడెనంచెంచెదల్.

చ॥ జనవరుకొల్వులోన నెలజవ్వనముల్ నిరవద్యవిద్యయుల్
దనరిన దాక్షిణాత్యనటిఁ తాండవమున్బొనరింపఁగంటి, న
వ్వనితనుగూర్చి స్వప్నమునఁ, బల్కినదేదియొ విన్నదై మదిల్
గనలియిటుల్ పరాఙ్ముఖతఁగాంచెను మత్ప్రియయంచు నెంచెదల్.

(సగౌరవముగా) ఇటురమ్ము.

(ప్రవేశించి)

నటి:- ఇదిగో! వచ్చితిని సెలవిండు.

సూత్రి:- మీకీన గౌరవమేల?

గీ॥ పాంసులీలా ప్రవృద్ధమై పరగుమైత్రి,
బాల్యపరిణయవిధియయి వరలెమనకుఁ

దలఁతు వేదేని నాయెడఁ దప్పుగాఁగ,
నందుకుఁ బ్రమాణమైనిల్చు నంగజుండు.

నటి:- నాకేమియు శంక లేదు. చేయునది యానతింపుము.

సూత్రి:- ఈయున హిల్లపట్టణాలంకార భూతమగు శ్రీశాంత్యుత్సవ దేవాలయమున భగవానుఁడగు నాభేయదేవు యాత్రామహోత్సవము మహామాత్యుఁడు సంపత్కరుఁడు జరుపుచుండ, సామంత జనము నూత్నప్రయోగ ప్రదర్శనమున కుత్సహించుచున్నదిగదా.

( నేపథ్యమునఁ బాట. )

గీ॥ సరస నవమాధవీ విలాసములఁ గాంచి
పరవశంబైన మనమున బ్రమసితిరుగుఁ
గుందలతఁ జుంబనము సల్పుకొనెడునాస
కుంద, భ్రమరప్రియుండు దానందునిందు.

సూత్రి:- (హర్షముతో) నటులు కర్ణసుందరీ నాటికను మొదలిడినట్లున్నది. ఆహా! సామాజికుల సుకృతపరిపాకము.

శా॥ నీహారాంశు కిరీటి దేవియె తనర్ నిర్ణిద్ర సారస్వత
వ్యాహారాళి స్వయంబుగాఁ గొమరుచాయల్ బాత్రిఁగావింపఁగా
సాహిత్యోప నిషన్నిషణ్ణమతియై సొంపొందు శ్రీబిల్హణుం,
డాహా! దీనికిఁగర్త, భీమతనయుం డౌరా! కథానాథుఁడా.

ఆకవియే యిట్లుఁ బలికియున్నాఁడు.

చ॥ ఇది యౌచిత్యముచేతనొప్పు, రసమిందెంతేని మిన్నందు, ని
య్యది వ్యుత్పత్తికి నాస్పదం, బిదియ కావ్యప్రాణ రక్షౌషధీ
పద, మిద్దానిఁ బఠింపుచున్ మెయిగగుర్పల్ దత్కవిశ్రాంతి స
మ్మదబాష్పోద్గమసంతతుల్ దొలఁచు నెమ్మెయి సన్మనుండాదృతిన్.

మఱియును,

చ॥ పలుకఁ బ్రియంబె దుర్జనుఁడు ప్రత్యయపాత్రుఁడుగాఁడు, ప్రాణముల్
తొలఁచుటకున్ మొదల్ విషము దోఁచుఁగదా మధురంబుగా, వరా,
కులుగలరేమి సేయు. నొక కొందఱుగూడియునాకు, నెందఱో
కలుగఁగ, సజ్జనుల్ సుకవి కల్పనలన్ గొనియాడ నేఁడునున్.

(వినుట నభినయించి) ఏమనుచున్నావు కథాసంరంభ మెద్దియనియా? వినుము.

గీ॥ నయనపర్వముఁ గొల్పు సౌందర్యవతిని
సరవి విద్యాధరేంద్రాత్మజను జళుక్య
వంశకలశాబ్ధివిధుఁడు వివాహమయ్యె
నతనియేల్బడి లోకత్రయంబువొగడు.

(ముందునకుఁజూచి) ఓహో! అప్పుడే నా సోదరుఁడు మహామాత్య ప్రణిధి భూమిక నాశ్రయించెను. రమ్ము! తరువాతి కార్యక్రమమునకు సిద్ధులమగుదము. (అని నిష్క్రమింతురు.)

ప్రస్తావము.

(అంతఁ బ్రణిధి ప్రవేశించును.)

ప్రణిధి:- అహో! యౌగంధరాయణాది ప్రఖ్యాతమంత్రులను మించు నమాత్య సంపత్కరుని బుద్ధి కడు శ్లాఘనీయము కదా! ఏలన,

గీ॥ శూరు నేనియు దండించుఁ, గ్రొంజెలులకుఁ
లొంగఁ, డొందఁడు మోమోటఁ, గుటిలనీతి
నేర్చితిర్గుచు నాచార నిష్ఠమించుఁ,
గామితము లేలికకుఁగూర్చుఁ గాని వేని.

మఱియును,

చ॥ అతికుటిలంబులౌ నతని యద్భుతచర్యని మంత్రరీతులన్
మతి మతిమంతులేని విధిమాయలటుల్ తెలియంగలేర, త

ప్రతిసరపాలగేహములై, తత్తురగోత్కర విశ్వధూననో
ద్ధతపటు రింఖికాగ్రదళితాగ్రమణిస్థలులై యెఱింగెదుఁగా.

మఱియును,

ఉ॥ శేషునకున్ విశేషమగు శేముషిఁ గల్గుట వంచనన్ సుర
ద్వేషులఁ గూల్చు భారమును విష్ణుఁడు పొంగి స్వయంబు దాల్చె, నా
భామల నేతకున్ గరముఁ బ్రజ్ఞవాసంగఁగ వజ్రికేల స్వ
ర్ద్వేషుల బందిగోనితికి, పెంపతి నిర్జర లక్ష్మి మాయఁగన్.

ఇపు డెల్లదిశలకు సేనాపతులు పంపఁబడిరి. (అని వినుట నభినయించి, యాకసము వంకఁ జూచి,)

మ॥ నిజవక్షోజ భరంబులన్ సురసరిన్నద్ధిప్రచంచద్రవి
ద్విజరాజభ్రమనందఁ జేయుచును, బృథ్వీనిష్ఠురశ్రోణి భా
గజసంబాధ రయస్థలద్రశనలన్ గ్వాణంబు రాణింప, నం
బుజనేత్రావళి వోలు నాకసమునన్ మోదమ్మునన్ గ్రుమ్మరున్.

(ముందునకుఁ జూచి యాశ్చర్యమున)

ఉ॥ అందెలమ్రోతపైని ప్రణయంబున యాన విలాసమున్ గడిం
పం దమకించి శిష్యతను వర్తిలెనా గృహహంసలంటిరాఁ
జందురులోననుండి దిగజారెననాఁగ సుధాంశుభాంగముల్
పొందగు నింటికేళి వనభూమికి నెవ్వరో యింపుఁ గూర్చెదున్.

(మఱలఁ జూచి),

మ॥ తనసంపూర్ణ సుధాంశు సుందరతరోదంచన్ముఖ జ్యోత్స్నఁ, జా
పిన చంచుచ్ఛటఁ బంపఁ బంజరాంతరములన్ బెంపౌ చకోరావళుల్
తినఁగాఁ గల్గిన యాలితాంగిసటులన్ దేఁగల్గిరో! కౌతుకం
బున మిన్నందిన దేవిగేహమునకున్ మున్నున్న దాసీజనుల్

(చింతించి),

చ॥ కదలని వాలుముంగురులు, గాసిలఁ జెమ్మటలొల్కఁ ఫాలముల్
బొదలు చెలుల్ దివిన్ దిరుగ, భూపతి శ్రీ చుళుకాన్వయోత్తముం
డుదితరతిన్ శివున్ గొలుచుచుండగఁ లింగము దాటిపోవునం
గద గదురంగ జారెనొక నాకచరాంగన యం చెఱింగితిన్.

(చమత్కారముగా) అమాత్యుఁడిపుడు నిక్కముగు కలఁ గనెను. స్వప్నమున భూపతికిఁ జక్రవర్తిత్వము లభించెనని నాతోఁ జెప్పెను. (పరిజనముఖమున)

చ॥ తెలుపఁబడెన్ సుధీకలన దేవి కొలందిగ సీతకుద్దిగాఁ,
గలిగితి సారె నట్టులన కాంచఁ, బరస్పరరాగవృద్ధిమైఁ
జెలఁగు తదీయ దంపతుల చిత్తములన్ వలమేలమీలఁగా
వలపులతేఁడొకండ మమఁ బారముఁజేర్పఁగ శక్తుఁడయ్యెడున్.

అగు:గాక. ఇప్పుడే,

శా॥ కేళీసౌధమునన్ నిశాంతవలభిన్ గ్రీడావనంబందు ర
త్నాళుల్ దాపిన జాలకంబులను మా రాక్రీడ వాసంబులన్
బ్రాలేయాంశునిలోఁ జిరంబునిలుపుం బాటించెనాఁ దోఁచునం
గాళిన్, బాల, ననంగునంగ పునరాప్త్యర్థంబుగా బ్రాయుదున్.

(నేపథ్యమున) దేవరికిది విశ్రామసమయము ఇప్పుడు,

ఉ॥ నాన ననాఁగఁ గుట్టిమమునన్ నతి నంజలితోడ బింబదం
భానఁ బ్రవేశమై ప్రణతి వ్యాళజగానకుసల్పి, ఛత్రముల్
జానిడనెల్లదిక్కులకు, జ్యోపతులొందుదు రాత్మగేహముల్
గానఁగఁదమ్ము, దుందుభిముఖధ్వని హృష్టపురీవరాననల్.

మఱియును,

మ॥ మొలలన్ ఝుణ్ఝణమ్రోయు మేఖలలగుంపుం గొండలన్ ముజ్జగం
బులగెల్వన్ సమకట్టు మాయనిచుచుంబున్ దెల్పునా, రోఁజెలుల్

గళితాంభోజ నిజాచ్ఛవక్త్రముల దిక్పాళిన్ నెలల్ నింపుచున్
వెలికిన్ దారిరి, సాంద్రవిభ్రమ సమన్వితాత్మ యానంబులన్.

మఱియును,

మ॥ జలదధ్వాన సదృక్షమృదంగరుతి విశ్రాంతిన్ గనెన్, మోముపె
న్నెలలారన్ జని రాటకత్రియలు సంగీతాంగనాల్ వీడుచున్
నిలఃపున్ గ్రాంచద చండకేళిఫణి భుజ్నృత్యోత్సవం బిప్పుడే
నలచంత్తుచ్ఛటనిక్కగాఁ దిరుగు సౌధాంత శ్చకోరాంగనల్.

ప్రణిధి:- దేవర యిపుడు విశ్రామమండప మలంకరించుట, నిక్కముగ నా నృత్తదర్శనమునఁగల్గు మన్మథావేగమే యతనికి నిర్జనప్రదేశ మందుట నుపదేశించుట యగును. కనుక నేను వెడలి యుచితకర్తవ్యము విచారించెద. (అని నిష్క్రమించును.)

శుద్ధవిష్కంభము.

---

(అంతట రాజును, విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.)

రాజు:- (ఔత్సుక్యముతో)

శా॥ తారానాయకుఁ డవ్వధూముఖము దిద్దన్ సల్పకౌఁబల్క, యు
త్తారల్ తన్విని వ్రాయుకుంచెఁడి క్రిందన్ గాల్సుధాబిందులో,
స్ఫారచ్ఛారదచంద్రికల్ సుదతి లావణ్యంపు శేషంబగున్,
మారేష్వాసనమామె భూరిచనకై మానార్థసూత్రంబగున్.

మఱియును,

మ॥ మునుకల్ గొట్టు విలాసవీచితతి సంభోజాక్షిదృక్శ్రేణి; కూ
ర్చును లీలావళి దామముల్ మనసకున్ భ్రూలేఖ; యంగాళిఁద
న్పును లావణ్యసుధాఝురం, బధరమంభోజాతరా గాంశు సే
చన మొందించెడుఁ దాగహారమునకున్ సాంద్రస్థితిన్ బైవయున్

మఱియును,

మ॥ త్రివళీసీమను లీలవ్రేలుజడయున్ దిర్యగ్గతిన్ బర్వుచూ
పు, విలాసంబుగఁద్రిప్పు కంఠము, రసస్ఫూర్తిన్ విడంబించు నా
నవలావణ్యవతీ ముఖాంబుజముఁ గందర్పుండు నాలోన, నా
నవలా సూడఁగఁజేయు నుత్సుకత వింతన్ వ్రాసిఁట్లయ్యెడన్.

విదూ:- దేవరా! ఒకవిషయ మడిగెదను.

రాజు:- (తిరస్కరించి)

గీ॥ సహజ రమణీయమగు తన్వి జవ్వనంబు
తనులత విలాసపల్లవతతిని గనుచుఁ
దన్నయన లీల యంబుజ స్థమయి యంతఁ
ద్రిభువనజిగీషు నొనరించుఁ దీయవిల్తు.

విదూ:- ఓయీ! నీవీ లీలావనంబుఁ బ్రవేశించుతఱిఁ జూచిన యామె యెవరు?

రాజు:-

ఉ॥ ధ్యానమొనర్చి శంకరుపదద్వయికిన్, విధిమ్రొక్కి, శబ్దసం
తానమాలన్ నుతించుచుఁ బ్రదక్షిణమూన, మనోజజంగమా
స్థానియనన్ మనోజ్ఞయయి చారుకదళ్యుపమోరుయుగ్మ, లీ
లా నవమోహనాంగి నవలా పొలిచెఁ గనుదోయి ముందటన్.

మ॥ కలయో లేక మహేంద్రజాలమొకో యింకన్ గాని యేదేని మి
క్కిలిఁ జిత్రంబుగఁ గంటి, నిగ్గుతరఁగల్ కేళ్ళాడు మేన్గల్గు తో
య్యాలి, జంద్రాబ్జ మృణాలచంద్రికలు మున్నా వానితోఁ బోల్కయే
దలపన్ రా దిది, వేలు నేర్చువిధి నూత్నంబైన యుల్లేఖమా.

విదూ:- ఓయీ! ఇట్టి యనర్థము సంభవించిన యీ యుద్యాన ప్రదేశమున మేలేమి?

రాజు:- మూర్ఖా!

గీ॥ త్రిజగదాలోకపేయ కాంతిజలముగల
యమల లావణ్యసరసి, యీరమణినిలుచు
స్థలమగుత నంగభవునకాస్థాన, మచటి
లతల నిలుపుత గుచ్ఛముల్ సతము మధుఁడు.

విదూ:- దేవరకు సంతాపదాయకమని చెప్పుచున్నాను.

రాజు:- మిత్రమా!

గీ॥ చంద్రికావర్తి జీవలోచనములకును
స్మరుని సామ్రాజ్యమున యశస్కరపతాక
యయిన యాచెలియెడఁ గోర్కె యడరికలఁగు
నతనితప్పిది న్యాయపద్ధతి వచింపు.

విదూ:- ఇట్టివివేకమున్నచో నేల వైరాగ్యమందవు?

రాజు:- అనభిజ్ఞుఁడవు చెప్పెదవినుము.

మ॥ కదియంగన్ జెలి, కాకతాళవిధి, రాగంబాత్మ నెవ్వానికే
నుదయంబంది, వివేకతోయముల నెంతోపాఁపినన్ బోక, నె
మ్మది నైల్యంబొనరించి స్థైర్యమెనయన్ మాంజిష్ఠమున్మించి, మం
చిదియౌ రంగు ననంగజుండు శరవహ్నిన్ రొప్పినట్లొప్పెడున్.

విదూ:- ఐన దేవిమనస్సు కలఁగినటులఁ గనఁబడుచున్నదేల?

రాజు:- వినుము. నేఁడు,

చ॥ మదనునిబాసినట్టి రతిమాడ్కి మాటికి దుస్సహంబుగా
నొదవెడు మోహనిద్రఁ గనుఁనుగ్గలినేఁ గలలోనఁగంటి, నిం
పొదవఁగఁ బచ్చతామరసి కుత్తరమందలి మాధవీలతా
స్పదమగు మండపంబున నిసర్గశుభాంగిని గేళికావనిన్.

విదూ:- తరువాత

రాజు:-

మ॥ సురమత్తేభ వినోదమందగతి, మంజుప్రౌఢదేహుండు నా
కరయన్ రానటుఁదోఁచు నీభవమునం, దంబా! గిరీశాత్మజా!
హరదారా! జగదేకవీర! భగవంతా! చిత్తజాతా! భవాం
తరమందైనఁ గృపాలవంబున, ననున్గావన్ దలంపూనుఁడీ.

మ॥ వలవంతన్ లలితాంగి యావిధముగా వాక్రుచ్చుచున్ సారెకున్
గలఁతన్ వజ్రముఖ ప్రభిన్నమటు హృత్కంజంబు దూలంగ, మూ
ర్ఛిలె, బాష్పాంబుకణాళి త్రొట్రిలి యురస్సీమన్ దొలంకాడ, మం
జుల హారాపరహారమై, త్రిచతుస్స్యూతాచ్ఛ తారంబుగన్

విదూ:- హా! తగదు, తగదు. మహానుభావురాలు సంకటము పాలయినది. తరువాత,

రాజు:-

ఉ॥ అంతటఁగొంతఁదేలి, నిడుపొగతి నూర్చుచుఁ జంటిపొంతనిం
తంతనటించు తారముల హారములన్గలదై వనస్థగు
ల్మాంతరమందు నూతనలతాళి నిరోధముఁగాంచి, పాశముల్
గొంతునఁ జుట్టుకో బిరుసుగొన్నటుఁగంటి వధూటిఁదొందరన్.

విదూ:- (చేమోడ్చి) అబ్రహ్మణ్యమగుఁగాక! అబ్రహ్మణ్య మగుఁగాక!

రాజు:- మూర్ఖుఁడా! ఇది స్వప్నవిధి.

విదూ:- తరువాత

రాజు:-

మ॥ అసువుల్ వాయఁగఁ గోర్కి యేమిటికి చానా! చాలు, నిక్కంబు నీ
వ, సుమా, సూనశరాసుపాలిటికి నెష్ఠ్యంబైన యాధారమం
చు, సఖిన్ గూరిచి పల్కి పుట్టమునయంచున్ బట్టితిన్, వెంటనే
చనియెన్ బో యెటకో జపంబు మెయిఁ నాఁజంద్రాస్య వన్నీడుచున్.

స్వప్నమొకప్పుడు నిజమగుచుండును. కావున నేమగునో తెలియదు.

విదూ:- ఇదంతయు శుభసూచకమేయగును. దేవికిఁ దెలియునా?

రాజు:- అవును.

విదూ:- పరుసములువలికి యన్యథా యేమియుఁ జేయలేవుగదా!

రాజు:-

మ॥ పరుసంబింతయుఁబల్కి, సంభ్రమముఁ జూపన్ లేదు, ప్రశ్నింపనీ
సరసీజాక్షి యెవర్తొ యంచు. బరిహాసచ్ఛాయనైనన్, దుదిన్
దరుణీరత్నము మెల్లనన్ దిరిగి నానారత్నదీపాంకురో
త్కరనీలీకరణాఢ్య నిశ్వసనమున్ దానిల్పి యేగెన్ జుమీ.

విదూ:- ఈమె భయంకరమగు విసపుముడి, ఏమైన నీకేమగును. తీపిమాటలచేనైనను, గాళ్ళపైఁ బడుటచేనైనను నీవసము చేసికొందువు. నేనొకఁడను బెదరితిని. ఈ దుష్టవిప్రుని దుర్విధి యిట్టిదియొ.

రాజు:- ఎట్లు? కాలేదు.

మ॥ చెలిపైనన్ బరిణామమున్ గనదు దాక్షిణ్యంబు నాలోన, వ
ర్తిలుఁ దత్కామిని ప్రేమమున్ మిగుల భ్రాంతిస్థానమై, నామనం
బల శూన్యంబయి యంగభూకితవ వాహ్యాళిన్ భయంబొందె, నేఁ
దెలియన్ జాల విరించి యేకరణి సూత్రింపన్ సమర్థించునో.

(నేపథ్యమున)

దేవర సుఖమునకై వసంతారంభమైనది.

మ॥ తనతప్పున్గను ద్రావిడిన్శఠుఁడు దుర్దాంతంబుఁ జుంబింప, నం
గన మోవిన్దగుకాంతి నెఱ్ఱనియశోకంబుల్ చిగుర్లొందెఁ, గాం
చనపాళిన్ గికురించెఁ బ్రౌఢమరఠీ నారీకపోలచ్ఛవుల్
ననలెత్తెన్ విరిమల్లెమొగ్గజిగి కర్ణాటీస్మితస్ఫూర్తులన్.

మ॥ రమణీయంబగు చూతమంజరి ధనుర్దండంబునన్ బైకపం
చమధాత్రిస్త్రముఁగూర్చి ముజ్జగముపై నైజాజ్ఞఁ గందర్పుఁడో
క్కమఱిన్ సాఁగఁగఁ జేయు, మౌర్వికిణియుక్తంబై, రతీవక్త్ర ప
త్రములన్ సొంపగు దోర్యుగీవలయ ముద్దాంతంబుగా నిల్పెడున్.

విదూ:-

శా॥ కావేరీతట నాళికేరచయమూఁగన్, నర్మకారాయతిన్
రేవన్ దేలిచి, గోడవీచికల మైత్రిన్మించుచున్, గాంచికా
గ్రావాంఘ్రిక్షుభితాంబువాహమురలాకల్లోలముల్ మాలగా,
భావప్రోద్భవు రేపఁ జేరునిదె, సిప్రా దన్పుచున్, దెమ్మెరల్.

రాజు:-

మ॥ హరిణీపోత తరంగితాక్షి మటుమాయంబై చనెన్, నాహృదం
తరమందున్ విలువంచి పంచశరుఁడున్ దావొందెఁ, జూతాంకురో
త్కరసమ్యగ్గ్రస నాతిలోల పరభృత్కాంతా కలారావ ని
ర్భరసంరంభముఁ జాటుకాల మిదియే ప్రాపించె దుర్దాంతమై

గీ॥ ఏణనయన చనియె నెటకే నవిషయమై
ఎడదవిల్లువంచి యొద్దెమగుఁడు
మావి ననలుమెసవి, మత్తిల్లి కోయిలల్
జయరుతం బొనర్చు సమయ మొదవె.

(సనిర్వేదోత్కంఠముగా)

చ॥ వెసఁ గిలికించితంబునకుఁ బెంపిడువాసము, పక్వవిభ్రమా
లసయుఁ, గవీశగోష్ఠియుఁ, గళానిధి ముగ్ధరుచుల్, పికాంగనా
విసర నినాదముల్, వికచవీరుదగారము చిత్రలీలలన్
బొసఁగువసంతమందు సుఖమున్ గనఁజేయును గొందఱకా మదిన్.

గీ॥ అల్లకిలికించిత జయావహావసథము
వికచలతికాలయము, శశి విమలరుచులు
సుకవిగోష్ఠి, పికీరుతి సుందరాంగి
కొందఱికి చైత్రమున సుఖం బందఁజేయు.

ఇప్పుడు,

గీ॥ లతలమొలఁగాడు పికముల రుతము నిలుపు
వాసగృహముల మారుతోద్ధ్వముః నాపు
నెచ్చెలులపిండు విరహిణీ నివహమునకుఁ
గలఁతఁ జేయున దిదియె నిచ్చలు నవజ్ఞ.

(చింతించి) కావున నేనెచట వినోదింతును?

విదూ:- ఓయీ! వయస్యా! క్రొంబూఁదేనె జాలువారు లలిత లతాలింగితకుసుమముల నొప్పారు తరుణతరునికరంబుల వెలయు నదియు, విలువంచి చండప్రహారము సేయు మదనసుభటుండు గుది యంచు పటుశిలీముఖంబుల నొప్పు సహకారాంకురముల నొప్పారు నదియుఁ, గలకంఠ కలకంఠముల చారుపంచమస్వరములచే శబ్దాయమానమైనదియు నగు నుద్యానవనము జూచుచు వినోదించెదవు.

రాజు:- నా వయస్యుఁడు సహృదయుఁడు.

గీ॥ కంతు నెసఁగొల్పు కోకిలా కలరవంబు
ధనువునఁగొల్చు ముల్కి చూతంపు మొలక

కుసుమహాసంబు, విరహాగ్ని కొఱవ్వు రేకఁ
గూడు సమిధలమోపుల కూడికయిది.

విదూ:- ఓయీ! ఆ త్రైలోక్యసుందరి యిచ్చటనే కనుచూపు మేరలో నెచటనే దైవవశమున నుండఁగలదని నుడివెద.

రాజు:- ఉండవచ్చును దారిఁజూపుము.

విదూ:-ఇచటనుండి సేవాగత నరేంద్ర సంకీర్ణంబును, విలాసాంచిత త్రైలోక్యసుందర జనంబునగు నా స్థానాంగణముపీడి చతుష్కికా గవాక్షమునుండి వెడలి యెటనేని నుండుము. (అని యిరువురు పరిక్రమింతురు.)

విదూ:- ఇదియే, కోయిలలు పలుచు చారుపంచమ స్వరమను మదనమంత్రమునకు సమ్మోహనమతము. వసంత సుభటునకు సంతతాస్థానము. కావున ప్రియవయస్యుఁడు ప్రవేశించుఁగాత,

అని యట్లు చేయుదురు.

విదూ:- ప్రియవయస్యా! చూడుము.

శా॥ హేళిన్ లాటి నటింపఁ గాల్‌దొలఁగు ఛాయాలేశమో నాఁగఁగం
కేళిన్ బల్లవమొప్పెఁ, బాటలిఁబువుల్ నిక్కెన్, వియుక్తాంగనా
పాళిన్ గంపముఁగూర్చెఁ గేసరము, పుష్పశ్రీతశల్యావళిన్
గ్రాలెన్ సంపెఁగ, కుంకుమార్ద్ర శుకకాంతాగండ భాగప్రభన్.

మ॥ పొలయల్కన్ బ్రియులందు గూర్జరులకున్ బోఁదోలుచున్, మేదపాటలతాంగీతతి సాంద్రమాన మద మోడన్ జేయుచున్, మాళవీ లలితాస్యాబ్జ పరిమళ గ్రహణలీలన్ మించి, హూణస్త్రీభయా నలకామశ్రమ బాష్పకణంబులు దొలంగన్ వీచెనున్ దెమ్మెరల్.

రాజు:- అహో! వర్ణనాక్రమము (అని నిట్టూర్చి నల్గడఁజూచి)

శా॥ లీలోద్యానమునన్ జలత్కీసలపాళి ప్రోల్లసద్భూజముల్
ఖేలాశ్లిష్యదలిస్రగావలిత భంగిన్ మించ, మీనాంకుఁడు
ద్వేలక్రోధమునన్ విలున్ వలయరీతిన్ లాగి గోధాయుతిన్
త్రైలోక్యంబు జయింపఁగాఁ బరుగునన్ దర్పించెనాఁ దోఁచెడున్.

రమ్ము. ఆ తరంగశాలలో క్షణము గూర్చుందము.

(అట్లు సేయుదురు)

విదూ:- (గోడవైపుఁజూచి, చమత్కారముతో)

అహో! ఊర్వశి మున్నగు నచ్చరల ప్రతిబింబమున సర్వాంగ లటభ వ్రాయఁబడినది. ఎవరీమె?

రాజు:- (చూచి, లేచి)

కం॥ అమరద్రుమసుమసౌభా
గ్యము కంతు విలాసగృహము కాయంబదె, జై
త్రమగు దృశాలీలయదే
రమణిమెం యిందుముఖియందు వ్రాయఁగఁబడియెన్.

మఱియు,

చ॥ బుడుగుననిక్కు భర్మఘటముల్ వలెఁ జన్నులు చూడనైన మే
న్బెడఁగిది, యద్ది ముజ్జగముఁ బేర్చి జయించెడిమూర్తి, యద్దియా
వెడవిలుకాని రాజనగరి, విచ్చిన కేతకిరేకఁబోల న
య్యొడి దృశయద్ది, మోవిఁదగునిద్దియ చాయ ప్రవాళకల్పమై.

విదూ:- ఓయీ! ఈమె నెవరు చిత్రమున వ్రాసిరి?

రాజు:- నా హృదయఫలకమున మన్మథుఁడు వ్రాసెను. ఇచట నెవరో మెఱుంగను.

విదూ:- ఓయీ! నీవనుష్ఠించుచో నొకమాటఁ జెప్పెదను.

రాజు:- ఏల చెప్పకూడదు?

విదూ:- ఈ తరంగశాలనుండి త్వరగాఁ దొలఁగుము. ఒకవేళ దేవి రాఁగలదు.

రాజు:- కుపితురాలగు దేవి సౌభాగ్యాభిమాన ఖండితయై యిట కేటులవచ్చును.

(అంత హారలతతో దేవి ప్రవేశించుచున్నది.)

దేవి:- హారలతా! అట్లు నేరముచేసిన యార్యపుత్రునిఁజూచి యపుడు నేను స్వయముగ నతని ననుసరించినచో నార్యపుత్రుఁడు నన్నేమనుకొనును?

హారలత:- దేవి మహానుభావ యని యనుకొనును. మఱేమి?

దేవి:- ఒకవేళ నేను గాఠిన్యమువహించిన నార్యపుత్రుఁ డాయాసపడును. అప్పు డనుచితకారిణి నగుదును.

హార:- ఈవిషయమాలోచించుటకు దేవిగాక మఱెవరున్నారు.

మృగాంకలేఖనువీడి చంద్రికావిసర ముండదుగదా?

దేవి:- ఆర్యపుత్రుఁడు స్వప్నమున దేనిఁగూర్చి పలవరించెనో యెఱుఁగుదువా?

హార:- జీవితము నీవశముచేసిన యతని కన్యవిషయ మెక్కడిది? యట్టివి కలలే విప్రలంభకములగును. శంకింపనక్కరలేదు.

(అని యిర్వురు పరిక్రమించుచున్నారు.)

దేవి:- కర్ణసుందరి యార్యపుత్రునకుఁ గనుపించినదా?

హార:- రవికిరణములకుఁగూడ నగోచరమయియున్న నిదియేలసంభవించును? ఇదిగో! ప్రభువు తరంగశాల నున్నాఁడు. సమీపింతముగాక.

దే:- ఏదియో వినిపించుచున్నది.

రాజు:- (అంజలిబద్ధుఁడై)

మ॥ స్మరదేవా! వహియింపనేల, వృథ నీచాపశ్రమంబిట్లు, త్వ
త్ఖరబాణవ్యయపాత్రుఁ డెవ్వఁడిచటన్ గాత్యాయనీకాముఁడుం,
డిరవా లోకవిలక్షణంబయిన నే దేనొక్కచందాన, నీ
తరుణీచిత్రమునే సజీవముగ సంధానించి యర్పింపుమా.

దేవి:- ఆర్యపుత్రుఁ డెవ్వరికై యిట్టులాలోచించుచున్నాఁడు?

హార:- నీవు కుపితవని తలఁచి, చిత్రప్రతిబింబమునకైనఁ బ్రభువు వినోదించుచున్నాఁడు. కాన సమీపింపుము.

దేవి:- (అడకువతో) నేనే కొంచెము పొరబడితిని. నన్నార్యపుత్రుఁ డన్యథా పలుకకుండవలయును.

రాజు:-

గీ॥ నీవె భువనత్రయిఁ బరంబు నిజమునాకు
నెలమిఁ గొల్పుదు తొగకు వెన్నెలవిధానఁ
గలఁగినెడ నలుకఁదాలుపఁగల, వొకప్పు
డుల్లమలరఁ బ్రసన్నవై యుందు వొ.లు.

విదూ:- దేవి ధన్యురాలు. ఇటులఁ బతియనుకూలత వహించుచున్నదిగదా.

దేవి: (చిత్తరువుఁజూచి, రాజు నపవారించి) హారలతా! చూడుము. కర్ణసుందరినే చిత్రించి వినోదించుచున్నాఁడు నీవు నామాట నమ్మవు. నేనే యవిమృశ్యకారిణినని యేల యనియెదవు.

హార.- అవును నిజమే.

దేవి.- (ప్రకాశముగా) నీ కనువిందు నేనువచ్చి తొలఁగించితిని. ఇపుడు చూడవచ్చును (అని యావేగముతో లేచును.)

రాజు.- అన్యథా సంభావింపకుము (అని నివారించును.)

(దేవి తిరస్కరించి హారలతతో నిష్క్రమించును.)

రాజు.- రమ్ము, దేవి నూరడింతము.

(అని యెల్లరు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము.



# ద్వితీయాంకము

(అంతట నిద్రనుండి మేల్కాంచిన విదూషకుఁడు ప్రవేశించును.)

విదూ:- (రెండు వ్రేళులతో రెండుకన్నుల నులుముకొనుచు) అప్పుడు నా ప్రియవయస్యుఁడు కడు నలుకఁబూనిన దేవి ననునయించి నాకొకవిషయ మానతిచ్చెను. అతని యాజ్ఞావిషయ మాలోచించుటచే వ్యాకులుఁడనై మంజిష్ఠారుణమైన యరుణసారథి మండల ముదయించు దాఁక మేల్కనియుంటిని. పడకనుండి హఠాత్తుగాఁ గన్నులుదెరచి లేవఁజాలకున్నాఁడ, ప్రియవయస్యుఁడు చరణములపైఁ బడుటచే సంత సించిన దేవి యనుగ్రహమునఁ బడసిన లడ్డులచే నాకడుపు నిండియు న్నది. కదలకుండ గదిలో నిద్రించెద. నేనెట్లు నిద్రింతు? ఆ విద్యాధర కన్యకకుఁగూడఁ దనపై ననురాగముగలదో లేదోయని యామెప్రవృత్తిఁ గనుఁగొనుటకై నా ప్రియమిత్రుఁడు నన్నాజ్ఞాపించెను. కనుక నేను వెళ్ళి యంతఃపుర విలాసిని యొకర్తుకనుండి యన్యాపదేశమునఁ గను గొందునుగాక. ఇదే యుత్పలతరంగయయి తరంగవతియను పేరుగలది యిటే వచ్చుచున్నది. అగుఁగాక! యీమెనుండియే తెలిసికొనెద. నన్నుఁజూచి యీమె యెద్దియో కప్పిపుచ్చెను. ఈ వటవృక్షమున యక్షుఁడున్నాఁడు. అగుఁగాక. ఊహించి తెలిసికొనెద.

(అని యట్లు సేయును.)

(అంతటఁ దరంగవతి ప్రవేశించును.)

తరం:-(ముందుకుఁజూచి) ఈ దుష్టవటు వీ శిశిరోపచారముజూడ గలఁడు. కావునఁ దొలఁగెదను (అని యట్లుపోవును.)

విదూ:- (సత్వరముగ సమీపించి) పూజ్యురాలా! ఏల తొలఁగి పోయెదవు! నేను జంద్రకళనువలె నీమార్గమునె చూచుచున్నాను. నీవు రాహువువలె నన్నుఁ బరిహరించుచున్నావు. ఏలయిట్లు?

తరం:- ఆర్యా! కార్యాంతరాకులహృదయ నగుట నిన్నుఁ జూడనైతిని క్షమించి శాంతింపుము.

విదూ:- పూజ్యురాలగు కర్ణసుందరి యేమి సేయుచున్నది.

తరం:- ఆమె తన సొంతముపనిలోనే యున్నది.

విదూ:- ఆమె సొంతముపని యేమి?

తరం:- దేవికడ లక్షణసారస్యములఁ గఱచుచున్నది. మదనేతరములగు పలుతెఱంగుల లీలలను.

విదూ:- (నవ్వి) ఎద్దియో మతియొక వ్యాపారమని వినవచ్చుచున్నది.

తరం- (సాశంకముగ) అదియేది నీవే తెలుపుము.

విదూ-- దేనికి వీనితో వినియోగము గలదో (అని యామె చీరలోనుండి యరటాకులను దామరతూడులను విలాసముగా తీయును.)

తరం--ఆర్యా! శంకవలదు. వీనితో నాకు వేఱుపనికలదు.

విదూ-అవిశ్వాసినీ! కప్పిపుచ్చకుము. ప్రియమిత్రునిచేఁ బ్రవృత్తిఁ గనుఁగొనుటకుఁ బంపఁబడితిని. కావున ఋజువుగఁ జెప్పుము.

తరం--పూజ్యుఁడా! రహస్యము రక్షింపఁబడవలయును.

చ॥ నెలచలికిన్ బ్రియంబిడఁడు, నీరజనేత్రి శరీరమున్ మహో
త్పలదళశయ్యనేనిఁ గడుఁ దాపముఁజెందుఁ, గుచప్రదేశ శీ
తల మలయోద్భవంబు తనుతాపముచేఁదుముకౌ, ననంగమం
గల మయభంగి భామయెడఁగన్పడు, నన్య మదేల పల్కఁగన్.

(అని చెప్పి తొలఁగును)

విదూ—(సంతోషముతో) పూజ్యురాలా! నీపని నెఱవేర్చుకొనుము. నేను ప్రియమిత్రుని నూల్కొల్పుదును.

(అని యిర్వురు నిష్క్రమింతురు)

## ప్ర వే శ క ము

(అంతట సోత్సుకుఁడైన రాజును విదూషకుఁడును ప్రవేశింతురు)

రాజు—

మ॥ తపనీయచ్ఛవి దోఁచుఁ; గ్రాఁగుపొఁగచేతన్ నల్లఁగన్నట్లు; శ్రీ
యుపసర్జించిన యట్లుగున్ నెల, చివుర్లో ఘాతరాగంబుల,
ట్లుపరిన్ గంతు ధనుస్సుచేవ యణినట్లుంచున్, సమస్తప్రభల్
స్వపఁగన్నట్లయగున్, సదంభలగు మోచల్ బాలకున్ముందటన్

మఱియును,

మ॥ నెలమూర్తుల్ చెలిమోమునన్ బొదమునెన్నేన్ గాంతివిస్ఫూర్తి న
చ్చెలికన్దోయి ననేకనీలకుముదశ్రీలూను విశ్రాంతిఁ; దో
య్యాలియోష్ఠంబు దహించు, విద్రుమరుచాత్యంత స్థిరాంశంబునన్
గలయన్ డ్రాపుఁ దదంగకంబులు మధూకస్నిగ్ధకాంతిచ్ఛటల్.

(అనుసంధించి)

మ॥ రసయోగంబు మెయిన్ విలాసపటలీరమ్యంబుగాఁగొంత, సా
రసనేత్రాంబక యుగ్మకంబు తుఱటి, దీర్ఘంబౌ నపాంగద్వయిన్
వసతిన్ గాంచ, ననంగుఁడోర! మొదలో బాధించు శల్యస్థితిన్
వెస నీయూఱటలేని మోహము తదావేగంబునన్ గల్గెడిన్.

అహో! ఈ సుమధ్యమ; కమనీయమగు వయసుననున్నది, చూడుము.

మ॥ పరిపూర్ణత్వముఁ గాంచియున్ గుచములిర్వంకల్ దొలంకేదఁబో;
విరు బొమ్మల్ నటనంబులన్ జెదరియున్ దృక్స్మేళనల్ లేవు; భా

స్వైరలీలాపరిరబ్ధమయ్యె గతి యాచార్యంగికిన్ శ్రోణులం
దరుదౌభారము చేసి మందరపదన్యాసంబు లేదయ్యెడున్.

మిత్రమా! తరంగవతిమాట సత్యమా!

విదూ.— ఈ కాముకులు మదనసంబంధములగు మృగతృష్ణలచే వంచింపంబడి నాకున్మత్తులుగఁ దోఁచుచున్నారు. ఏలనఁ బ్రత్యక్షవస్తువునఁగూడ సందియమందుదురు. నన్ను సర్వథా నమ్మవు గాన నకరణీయమునైనఁ జేసెద. బ్రాహ్మణచరణములంటి యొట్టిడుకొనియెద.

రాజు:— హృదయమా! అదృష్టముచే వృద్ధినొందుచున్నావు.

చ॥ మదవతియందు మిక్కిలిఁ గ్రమంబుగ రాగ నిమగ్నవయ్యెదీ.
వదటునఁ గాడమండి తుహినాంబులమున్గు వనేజమట్లు, ల
య్యెడ మదిరాక్షియుఁ జెవులయందలి కమ్మలడుల్చి స్వేచ్ఛమై
బొదలుఁ బ్రసూనసాయకుఁడు పూన్చు శరమ్ముల సాముసేయునన్.

("రసయోగంబు..." ఇత్యాది పద్యములు చదువును.)

విదూ:- (నవ్వి) నేనొకటి యడుగుదును.

రాజు:- ఏల యడుగవు?

విదూ:- స్నిగ్ధముగ్ధ మనోహరమును, హర్షోత్ఫుల్ల కపోలమండలము నగు నమ్ముఖదృష్టిఁ దిరస్కరించి కాముకులు కుపితురాండ్రవలెనుండు కామినుల వక్రమైనదృష్టి నేల ప్రశంసించెదరు?

రాజు:- అరసికుఁడవు. చూడుము,

ఉ॥ వాలగు కన్గొనన్ నయనవారి దొలంకఁగ లోలలోచనల్
హాలిఁ వతంసపద్మరుచిహారి నిజాక్షినిగంటి, తుంటవిల్
డాలుపు వాలుమించెదునో, తత్సమమో, యది ప్రేమచిహ్నమై
పోలు, జగత్త్రయిన్ గెలుచు పూనికి నంగజుఁడూనకున్నెడన్.

విదూ--ఓయీ! వేఱుచెప్పెద. ఏ కర్ణసుందరి కారణమున దేవిని రాత్రియెల్ల మిగుల దుఃఖముతో వేఁడితివో, యా కర్ణసుందరికై యిపుడేల యనుసంధించుచున్నావు. ఆమెతోనే కార్యమైనచో నేల పీడితురాలగు దేవిని మఱల ననునయించెదవు. లేక దేవెరితోనే కార్యమైనచో నేల కర్ణసుందరి ననుసరించెదవు.

రాజు--ఓయీ! మిత్రమా! వినుము.

చ॥ విడువఁగఁజాలనంతయును విశ్వసుతాఖ్య కులప్రసూతయై
కడుఁబ్రియంబుఁగూర్చు తనుగాత్రిని దేవిని, సన్నుతాంగముల్
బడసిన దీనినెట్లు విడువందగుఁ, జెంగట నంగజుండు దాఁ
దొడిగి తనుత్రమున్ బువ్వులతూపులనెక్కిడి నిక్కియుండఁగన్.

కాన, నేనెట్టులీ విరహతాపమును గడపుదును.

విదూ:- సర్వథా ప్రియవయస్యుఁ డసుఖియై యున్నాఁడని దేవికి దయఁగల్గించి స్వస్తివాచకపూర్వకముగ నోదార్చి యా కర్ణసుందరి నతని కర్పింపుమని యడిగెదను.

రాజు:- మూర్ఖుఁడా!

చ॥ అనునయ మెంతయో నిటుల నందఁగఁ జేసిన నామెడన్ గడున్
గినుకయె దేవి దాల్చుఁ బరికింపఁగఁ జిచ్చున నిల్వగా, మఱిక
ఘనకరవాలధారలకుఁ గాయమునిల్ప సుశక్యమౌను, నా
ధునిఁ బెడఁబాసి యుండగ వధూటులకుం దరమే ధరాస్థలిన్.

నే నెచ్చట వినోదింతును.

విదూ:- ఓయీ! ఆ యుద్యానవనమునకే వెడలుము. అటఁ దరంగశాలాభ్యంతరమునఁ జిత్రగతను జూచుచు సుఖమందగలవు.

రాజు: మిత్రమా! యుక్తముగ నొడివితివి. దారిఁజూపుము.

విదూ— ఇటుఇటు (అని నడుచును). ఇది తరంగశాల అలంకరింపఁబడుఁగాక! (ఇరువురు నటులఁ జేయుదురు.)

విదూ— (అంతటఁజూచి) ఓయీ! ఆ శ్యామలాంగి అనంగదేవత యెచట లిఖింపఁబడెను. లేక చర్మచక్షుండనగు నేను జూడఁజాలనో!

రాజు— (నిట్టూర్చి) ఎట్లు! ఆ యనంగశస్త్ర మగుపడకుండ నైనది. అహో! దేవి యెంత నిర్దయురాలు.

మ॥ లలనాదేశికసిద్ధభూమియనఁగా లావణ్యసారోచ్చయా
కలనా చిహ్నమనాన్ జగత్త్రియ దృశైకప్రేమ విక్షేపమై
నలువా వేల్పనేకచంద్రముల విన్నాణంబనాఁ బల్కె, ని
ల్పు లతాంగిన్ గనసేర నెట్టివిధియో చూపట్టు నాకడ్డమై.

(చింతించి)

చ॥ తలిరుల విల్లుకానివిడి తన్విని చిత్రమునన్ లిఖింపఁగా
శలియు ననల్పశిల్పుఁడు విశారదుఁ డెవ్వఁడితఃపరుండు, త
త్కలితవికల్పజాలమునఁ గల్పితమయ్యె నిజంబు, మత్పుర
స్థలమున నింద్రజాల మొకచాయన నన్భ్రమియింపఁ జేయుచున్.

(అని దుఃఖము నటించును)

విదూ—ఓయీ! దేవకులము లేని యిచట నేమిపని? రమ్ము! లీలావనాంతరమునఁ దిరుగుదము. ఆమె యచటఁ బువ్వులు గోయుచుండియుఁగాని, సరసీజలమున స్నానము సేయుచుండియుఁగాని యుండఁ గలదు.

రాజు—మనకింతటి భాగ్యసంపద లెక్కడ? ఐనను బశ్చాత్తాపముఁ బోనడఁచుటకు నదియుఁ జేయఁబడుఁగాక.

(అని యట్లు సేతురు)

విదూ— (ముందునకుఁజూచి) చూడుము. కేళికమలినీ!

ఉ॥ ఆననసంగతంబగు రథాంగచయంబును బాయఁజేసి, యెం
తేని నకాలమందుఁ గదియింపుచు నిద్రివనేజపాళి; క

(ముందునకుఁజూచి)

న్యానతటస్ఫురత్కరత నొప్పుచుఁ గన్నులవిందొనర్చుచున్
జానుగ నీటమున్కలను సల్పెడు నయ్యెడు రాజుపెంపునన్.

చ॥ అల త్రిజగజ్జిగీషువగు నంగజుమైత్రికిఁ బాత్రమై యువా
వలి యవినీతమాన్పు గురువర్యుఁడదే యుడురాజు; వానిలో
పలఁగల నల్పు దైవవిధిఁబాసెనో, వారిభవాకరామృతా
మలినవవీచి ధౌతమయి మాసెను నిక్కముగాఁ దలంపఁగన్.

(సోత్ప్రేక్షముగ)

క॥ చెలిమొగమున నొకపరియే
నలినారియు నోటువడిన నలినములును లో
గల శాశ్వతవైరమువిడి
పొలుచువిశేషయుత దదాస్యమున కన్వహమున్.

విదూ:-

క॥ అదె రోహిణీముఖచుంబనఁ
గదిసిన పరిమళమువొదలు గ్లౌమండలమున్
బొదివిన తుమ్మెదకొదమలు
వదలఁచు నద్దానినుండి పాయవు దవ్వై.

రాజు:- (నిపుణముగ నిరూపించి సహర్షముగ

ఉ॥ కైరవిణీమదుండు సితకాండుఁడనంగుని యెల్లయానలన్
గేరునొయారిమోముఁ దిలకింపఁడ! లీలఁగనేనిఁ; జేరన్న్
సౌరభకారణంబునను షట్పదబృందము; వేణుదండమున్
జారుతరంబుగాఁగదలు శ్యామలకంఠము బర్హిమట్టులన్.

మఱియును,

గీ॥ అమరతరుపత్రసకులీనమైనపాణి
గలిగి వాలనాగ మదనాశుగముగ నిలుచు
నేలనో పద్మ పద్మాంతరాళ మెడలి
జలములందు వ్రతంబూని నిలిచె నాఁయన.

విదూ:- (సకౌతుకముగ)

గీ॥ పొలఁతి వేనలి విభ్రమస్ఫురణలేదు
పొలయువాసనఁ దుమ్మెదల్ నెలఁగదియవు
కమలినీ విభ్రమాఢ్య వక్త్రమున నీటఁ
బొడమెఁ బొందమ్ము లలమఁగఁ బూవుఁబోఁడి.

రాజు:-

చ॥ చివురుల విల్లుకాని యభిషేచనకున్ దగునో, హరాగ్నిలో
దవిలినదర్పకున్ మఱలఁ దాఁబ్రతికించునో, శంఖనిర్మలం
బవు జిగిగల్గు నీసరసిజాకరమందు రుచిస్రవోపమం
బవు చెలిసోయగంపు ఝరి నందెనుగా యిటువంటి యోగ్యతన్.

మఱియు,

చ॥ వనజవనంబునన్ నిలిచి పైదలికాంతి సుధాద్రవంబునన్
దన తనుకాంతిసంతతముఁ దాలిచి యిందిర, తత్ఫలంబుగా
మనసిజవైరి మేన సతి మాడ్కి సాంద్రతరానురక్తిచేఁ
దనకు వశీకృతుండగు గదాధరుపై మదనాస్త్రమెక్కెడున్.

విదూ:- వనానిలమూవరించు పవడంపుఁ జిగురునకు సరియగు మెఱయు వాతెఱ గలదియు, నంగుళివివర్తనముచే నందమగు కరపల్లవము గలదియు, నాసాగ్రలగ్నములై స్పష్టములగు నీలోత్పలములకు సరియగు లావణ్యముగల కన్నులుగలదియు నాయెను.

రాజు:-

గీ॥ దంతకౌముది వెలయు రదచ్ఛదంబు
యోగముద్రఁగయిన్ వ్రేళు లూఁగుటయును

నలుపుతోవఁగేరు కంటను గలుగు మోదు
దలఁప నధిదైవతమొకండు తన్విఁగొలుచు.

విదూ:- (కౌతుకమున) ఈమె యేల! యూరకయే మాటి మాటికి నీటినడుమనుండి తనచేతిని లాగుచున్నది.

రాజు:- (చూచి)

క॥ తనమన మెచ్చటనో చన
వనిత యుపాంతస్థితాంబుభరభర్మఘటం
బును గనక జలములోఁగల
తనచన్నుల చాయఁగేలుదమ్మిఁ ముట్టున్.

(సస్పృహాముగ)

చ॥ ఇమి కెడు కజ్జలంబు నలుపించుకదృష్టికి నిచ్చుకాంతియున్
దములముచోట మోవి యెగఁదట్టెడు పాటలతల్, నిరంగ రా
గమునను మంగళంబయిన కామినిమేన విలాసలక్ష్మి వి
శ్రమముఁగనున్, మనోభవునిచాపము జృంభణ మూనకుండునే.

విదూ:- (చూచి) పార్వతీచరణసేవ చేసి యీ తమ్మికొలఁకు నుండివెడలి యేకాంతమునఁ జెలితోఁగూడి తీవెపొదలోఁ బ్రవేశించినది.

రాజు:-

గీ. కమల పత్రాక్షి ధూపాంశుకమున వేణి
గుణముఁ దుడుచుచుఁ జెలిచేరఁ బ్రణయ మొప్పఁ
బలుకునట్టులఁ గూర్చుండు నలమఘుదుధ్రి
వనమునన్ వనదేవత వడుపు దోప.

(సహర్షముగ,) మిత్రమా: విరహచిహ్నములు సువ్యక్తములు. చూడుము.

చ॥ సముఖ లతావళీ కుసుమజాలము వేలచు నూర్పుగుంపు, వృ
క్షముల కెఁగ శార్దులక సలంపఁ జాలు దృగంబుఝరంబు కంజప
త్రిముల మృదుత్వ మూర్చ్చ తనుతాపమొకండును. గాశకాండపాం
డిమమున మించు మోమును గడించిఁ బడంతికి నొప్పిదున్ సఖా.

విదూ:- ప్రియవయస్యుఁడు బాగుగఁ జూచియున్నాఁడు.

రాజు:- మిత్రిమా; యీలతాగృహము వెనుకనుండియే యామె విస్రంభవచనముల వించముగాక. (అని యట్లు సేయుదురు.)

(అంతటఁ బూర్వ నిర్దిష్టచటుల. నాయికయు సఖియు, బ్రవేశింతురు.)

నాయిక:-

గీ॥ భక్తిరస సిక్తమైనను ఫలితమెపుడొ
గౌరిచరణ ప్రిసాద వృక్షుంబునకును.
వలపుచిచ్చునఁ గరమునేఁ గలఁగియపుడ
యలము కడగండ్లఁబడుచు హతాశనైతి.

మరియు.

ఉ॥ చేరఁగ వచ్చు చంద్రుఁ డనఁ జెల్లెడు మోమును, క్షీరధౌత మో
నా రహిం మించు దృష్టియు, ఘనంబగు శ్యామలగౌర సుందరా
కారము గౌరిధ్యానమునఁ గన్పడెఁ గన్నెను నన్ విపన్నగా
నారసి జీవముల్ నిలుచున ట్లొనరించునొ తా నొనర్పదో

సఖి:- మరియు నితనియందుఁ గూడ మదనుఁడు సన్నద్ధుఁడని యెట్లుత్సాహ పడుచుంటివి.

నాయిక:- సఖీ! ఊరార్చుట చాలును.

సఖి:-ఐతే ఆమహానుభావునికొరకే శ్లోకములఁ బ్రస్తావించితివో అవియేల రచింపకున్నావు.

నాయిక:- నీవేశక్తురాలవు శ్లోకయుగమును రచింపుము. మద
నరస సంకల్ప వికల్పములచే నానిశ్చలదృష్టి యుద్ఘగింప బడుచున్నది.

సఖి:- (కొంచముండి) సఖి, వినుము.

చ॥ నెలపయి వీతరాగయయి నెమ్మొగమున్ గనదద్దమందుఁ,గో
యిలరుతివంతఁ గాంచియు నొకించుకఁ బల్కదు, దాహమూన్చన
న్నలిన పృషత్కపైఁబగఁదనర్చును, జిత్రమగున్ గరంబున
క్కలికి యనుక్షణంబు ననుఁగా, : యనురాగము బెంచు నీమొకన్.

మఱియు

మ॥ తనువున్ రాజసభాంతరస్థితమణిస్తంభంబునన్ జేర్చు చె
ల్వను బింబంబుగఁ బోత్రితగా, ఘటితగా భావించుచున్ నీదుపా
టను నిత్యంబు కురంగిఁ బోలి వినుచుంటన్ గంటసీరొల్కగాఁ
దనువందున్ బులకల్ జనింపఁగ సఖీతండం బెఱుంగున్ జెలిన్.

నాయిక:- బాగుగా రచించితివి. సరస కవిత్వమున విప్రలం
భము పరాకాష్ఠ నారోహించినది.

రాజు:- కావ్యోపనిషత్తుల కంతరంగురాల వైతివి.

నాయిక:- నేనుఁగూడ సందేశము జరిపితిని.

సఖి:-ఎట్టిదా సందేశము. రసదానముచే శ్రవణముల గండూ
షింపుము.

నాయిక:-

చ॥ చలినెలయిచ్చునే మలయజంబుగతిన్, శ్రుతివల్లకీరవం
బలవడజేయునే వరసమాగమ, మంగభవుండు మిత్రుఁడే,
నలినమునందుఁ జూపు రమణా వహియించునె, దక్షిణుండుగా
నిలుచునె దక్షిణానిలుఁడు నీవిటు నాయెడ జాగుసేసినన్.

విదూ:- ఓయీ! నీవిప్పుడు నమ్మఁబడుచున్నావు.

రాజు:- (సంతసించును.)

సఖి:-సఖీ! ఆత్మదశను నివేదించురూపమునఁ బ్రభువు బాగుగా నిందింపఁబడి మె.

నాయిక:- ఇట్లు విని యేమిచేయఁబడును.

సఖి:- వేఱేమి యున్నది.

క॥ నవరస తృష్ణా కులుఁడౌ
నవనీరజ నయనుఁ డనుఁగు నళినాలయుకై
నవశశి మకుటుం డుముకై
నవక మెడలి మున్నె వెతఁ గనంగా లేదే.

నాయిక:- ఎచ్చటనైనను సఖి యవమానింపదుగదా.

సఖి:- (నవ్వి)

క॥ పరిభవ వేళన్ నీకుఁ
సరియగు తిరుణు లెటువీడి చనెదరు నిన్నుఁ
గరము సుఖము నీ వెట్టుల
నరసెద వీరీతి దవ్వునం దాపఁబడన్.

నాయిక:- (సోత్కంఠముగ)

క॥ వలచిచ్చునఁ బొగిలిననేఁ
జెలి! సిగ్గుఁ వీడి నాథుఁజేరెద, నాపైఁ
దలఁచినటు దేవి సేయుత
ఒలితపు విరహాగ్ని నిడుమఁ బడ నాకేలా.

విదూ:- ఓయీ! ఇప్పుడు జాగుసేయుట లగ్గుగాదు. సఖిఁజూపింపుము.

రాజు:- మూర్ఖుఁడా! చపలుఁడవా యేమి?

సఖి:- సఖీ! వ్యాకుల వైతివా యేమి? యేమియు నూహింప రాని యమంగళ లక్షణములు నీయందుఁ గన్పడుచున్నవి.

నాయిక-మృత్యుసంభావ నార్హములగు భాగధేయములే నాకుఁ గలవు.

ఉ॥ కానిపనిన్ ధురంధరతఁ గౌర్యనిధానుఁడు కాముఁడూనె, నా
మానస బాధనెంతయును మాన్పఁగ బంధుఁడు గాన రాఁడు నే
హీనదశాస్థితిన్ వనట నెద్దితి, నంతయు నంతమానటుల్
హా! నిజమయ్యె నిమ్మెడఁ, దనంతట మృత్యువు చేరువన్‌దగున్.

(అని మూర్ఛిల్లును)

విదూ- ఓయీ! చాలఁ బ్రమాదము గల్గెను. నేను దొలుత నే చెప్పితినిగదా సమీపింపుమని.

(రాజు ససంభ్రమముగ నుపసరించును.)

సఖి- జయమగుఁగాత.

విదూ- అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము.

సఖి- మహారాజా! హస్తమునఁ దాఁకుము. అటులఁ దాఁకుటచేఁ జేతనము లభించును

రాజు- (అట్లు సేయుచు,)

చ॥ ముకుళితమయ్యెఁ గన్నుఁగవ పూనువిలోలతఁ; గాను స్వేదబిం
దకయ యురోజకుంభముల దందడినూర్పుఁ; బ్రసాదభావమా
గక ముఖలక్ష్మి తాపమునఁ గందియుఁ దాఁ బులకాన్వితంబుగాఁ
బ్రకటన సేయు; నిక్కముగ భామిని భావము పర్వె నాదెసన్.

(మఱలఁజూచి) అహో! ఈమె రామణీయక మెల్లయవస్థ లందును భేదమొందక స్థిరముగా నున్నది. ఔను,

ఉ॥ ఈలలితాంగి కన్నొనలు నృత్యముసేయుచుఁ గ్రిందుమీఁదుగా
లీలఁ దొలంకుచేది, సకులీనతఁ గంతుని చాపవల్లికిన్
దాలుచుఁ; గూర్కు-నీలకుసుమదద్వయికిన్ గనుదోయి వాదులన్
దాలుచు, గూర్పుచేఁ బడలినన్ గను వాతెఱ నైజధుర్యతన్.

విదూ- నీవు మా ప్రియవయస్యుని హస్తమునఁ దాఁకఁబడియు చైతన్యమెట్లు పొందకుంటివి?

రాజు- (సానందముగఁ దనలో)

గీ॥ సుధకునిధి చంద్రసరసిలోఁ జొచ్చినట్లు
తావలతమ్ముల కడుపులోఁ దూరినట్లు
వేలుపుల పూలజాలులోఁ దేలినట్లు
దీనిలో మానసము నిర్వృతిని గడించు.

సఖి- చెలీ! ఈ హస్తస్పర్శమునఁగూడఁ దేరకున్నావు! అహో! ఏమి నీ కఠినత్వము!

నాయిక- (కొలఁదిగ నిట్టూర్చి) ఆహా! ఏల రసాయనౌషధమునఁ దడుపఁబడినట్లు సుఖించుచుంటిని ఈ జనము జీవనము కాంక్షించినది. (అని కొంచెముచూచి సిగ్గుతో నుండును.)

రాజు- ప్రియా!

ఉ॥ ఏల విరాళిఁజాల వహియింతువు; పల్కుమ! యూరడిల్లుమా,
ఏల స్పృహాపహక్రియ వహింతువు ప్రేమను బూనువానికై
హాళిగఁ గంటివిందగుమ, యుంగజువాగుర కానుమా! చెలీ!
నీలసరోజమాల జిగి నిక్కెడుచూడికి నన్నుఁదేల్పుమా.

విదూ- దేవీ! యసత్యపునిద్ర నేల విడువవు! ప్రియవయస్యుఁ డిట్లు పిన్నదనముఁ జూపుచున్నాఁడు.

సఖి- ఏల జ్ఞానశూన్యురాల వయితివి. (అని యామెను బలవంతముగాఁ దెచ్చి రాజాంతికమునఁ గూర్చుండఁజేయును.)

నాయిక- (కృత్రిమ కోపముతో) పరిహాసశీలురాలా! తొలంగుము. (అని యసూయతోఁ జూచును.)

రాజు-

క॥ మందాత్మానతమై, నూ
త్నేందీవరదామ మట్టు లింపుగ నిడుపౌ
సుందరి చూపంగజుమెయి
కందమునం దించుతంత్ర మనుచు నెఱుఁగుదున్.

(అని వస్త్రాంచలమునఁ దుడుచుచు,)

గీ॥ నీదు పరిజనమున నొకండేనుగానొ,
లజ్జఁగనియెద వేల యోలలితగాత్రి!
కౌఁగిలింపుము నన్ను నంగమునఁ బొదలు,
నట్టి హరిచందనపు విరు లరవిరియుత.

(అని కౌఁగిలింపఁగోరును.)

నాయిక- హృదయమా! కోర్కెలఁగూడ మించియుంటివి.

సఖి- వీరిరువురకు విస్రంభాలాపములు జరుగుఁగాక (అని యల్లనఁ దొలఁగును.)

విదూ- పూజ్యురాలా! ఇదిగో దేవి వచ్చెను.

(సఖి ససంభ్రమముగా వెడలును. నాయిక భయముతో లేచును.)

రాజు-(భయముతో దెసలఁబరికించి) మూర్ఖుడా! ఆమెయెక్కడ?

విదూ- ఓయీ! పూజ్యురాలగు కర్ణసుందరికై దేవి యుద్యానవన మలంకరించిన దని చెప్పితిని.

రాజు- (ముందునకుఁజూచి) నిజముగా దేవి వచ్చెనా? అహో! శుభమూలీ బ్రహ్మబంధువునకు ఫలించెను.

నాయిక- (చూచి మనమున) ఆకాశము లేకయే పిడుగుపడుట యెట్లు?

సఖి- మహారాజా! నన్నాజ్ఞప్తియందుంచుకొనుఁడు. ఇపుడు మేమిర్వురము వేఱెడకుఁ బోవుచున్నాము.

విదూ- మేమిర్వురము నటులనే చేయుదుము.

(నాయిక సఖితో నిష్క్రమించెను.)

రాజు- (నిట్టూర్చి)

ఉ॥ చదలుననుండి దట్టమయి జారెను చంద్రము కౌముదిన్వలెన్
ముదితను జీవనాధికను బొందియు దైవవిధిన్ రసోర్మిలన్
బొదలుచు నిప్పుడేనుద్రిటిఁ బూనఁగనైతి స్వతంత్రతన్, వృథా
స్పదమయి యున్నదేనొనరుపన్ గలదేదియొ తోచదయ్యెడన్.

(అంత దేవియు హారలతయుఁ బ్రవేశింతురు.)

దేవి- రాచకర్జములు లేని యిట్టిసమయమున నిర్విణ్ణుఁడైన యార్యపుత్రుఁ డిటనే వినోదించును.

రాజు- దేవి నన్నెఱిఁగెనా?

విదూ- అంతగఁ గోపించిన దేవి వయస్యునిచే నూరడింపఁబడి నదై యెట్లు విపరీతముగా ననుసరింపఁగలదు.

రాజు- ఏమును అభ్యంతరముననకే పోవుదుము.

(అని యందరు నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము సంపూర్ణము.

# తృతీయాంకము

(అంత నిర్వురు చేటులు ప్రవేశింతురు)

ఒకతె:- సఖీ! వకుళావళీ! ఎవఁడు రహస్యము నిశ్శంకముగా వెలిపెట్టునో అతఁడే హృదయమువలె బంధువుగదా; కాన నీవు చెప్పుము. దేవి గృహమునందేల యాలోచించుచుంటివి.

వకుళా:- సఖీ! మండోదరీ! నాకు నమ్మికలేదు. నీవు చపలభావమున మఱచి యెవరియెదుటనైనఁ జెప్పుదువని యెంచిగింపకున్నాను. కోపగించుచున్నావు. కానఁ జెప్పెదను. పరమమగు మంత్రము ఇతరు తెలియఁగనటు లుంచుము.

మండో:- నమ్మికలేనిదానా! చెప్పుము.

వకుళా:- సఖీ! ప్రభువు విద్యాధరకన్యకయం దనురక్తుఁడై యున్నాఁడు. అయితే దేవికారణమున నేమియుఁ జేయఁజాలకున్నాడని యంతట ననుకోఁబడుచున్నది. ఏమన దేవితోఁ గలహించువాఁడైయపలపించుచున్నాఁడు. ఆర్యుఁడగు బాదరాయణునిచే నంతఃపురంశాలకు వెనుకదెసఁ దీర్పఁబడిన మదనోద్యానకమందు నేటి ప్రదోషవేళ సంకేతము నిర్ణయింపఁబడి యున్నది.......... దేవియంతయు విని నాకుఁ జెప్పినది. ఇప్పుడు నేను గర్ణసుందరీ రూపమును, నీవు దాని సఖి రూపమును వహించి పోయి, యార్యపుత్రుని వంచింపవలయును. కావున నీవార్త రక్షించుక సిద్ధపడుము. అని

మండో:- అహో! మహారాజు సంకటములోఁ బడినాఁడు. ఈ రాజు లక్ష్మీసనాథుఁడయి యచ్చటఁ గర్ణసుందరి నెదురుచూచుచుండును. కావున రమ్ము! పోవుదము. మనలఁజూచి రహస్యము బయలు కాకుండుఁగాక. (అని నిష్క్రమింతురు.) ప్రవేశకము.

(అంత యథా నిర్దిష్టంబగు రాజు ప్రవేశించును.)

రాజు—

ఉ॥ స్వైర విహార మొందియును కృశేల్ వలనంబుఁ దిరోంచనంబులే
కారయరావు; సంస్తుత జనాలఘనంబున నోష్ఠకాంతి నేన్
దూరము సేయు లేనగవు దూలదు, విస్మృతి నేన్ రహించు వ్యా
హారము తొట్రుపాటు మటఁ డారయఁ జేయు విదగ్ధతారతిన్.

మఱియు,

చ॥ కలికి ముఖంబు చేతఁ దనకాంతి దొలంగుచు వన్నెఁ బాసి జా
ఱిలి విధి దూలినట్లు కరబృందము సాచి సమస్తరాత్రిలో
పలఁగొనెఁ; బత్రిముల్ విఱియఁ బాఱిన యుత్పలవాటి తద్దృశా
స్ఖలిత విసీలకాంతియగు నా విసతి ధ్వనికాంతు చేసెనున్.

(అని యంగభంగ సహితముగా)

చ॥ కమలము తత్పదద్వయముకిఁ గాంచఁగఁబోవదు దాస్యమేనియున్
సుమశరువిల్లు తన్వి బొమ చొప్పున కోడి సతంబువంగుఁ; జం
ద్రిముఁ డొనరించు నేది విధిదప్పఁ, దదాననకింకరత్వ శీ
లము దగు నంకమున్ గనియె లగ్గుననన్ దనతోడఁ గూడిరాన్.

(స్మృతి నభినయించి)

ఉ॥ చన్నులు మున్నుఁ దస్తులుచు సాగఁగ నిచ్చునటున్న ధ్యానమం
దున్నటుగోలె సాచి గతినొప్పెను గన్నులశిత్తుఁ; జన్నులున్
గొన్నినపల్లు ముఖ్యసఖుఁ గొంటొకసిన్ హృదయాస నిల్పు నాఁ
గన్నన గుండెనుండి వెలిగా వెడలన్ గడుఁ దొందరించెడున్.

మఱియు,

మ॥ నతతాళీదళ కోమలత్వమునమించన్ గల్గు గండాంశువున్
సతతానిప్రికరావృతిన్ బ్రబలు నిశ్వాసానిలంబుల్ తరం
గితయానంబున నాకృశత్వమును కొంతే శిక్షయా మేని సం
స్తుత లావణ్య మదెంతయున్ వెల్లదికిన్ సొంపారు నూత్నక్రియన్

మఱియు,

గీ॥ పంచశర దైవతవిలాస వైజయంతి
యింతి లీలారసాలసవృత్తి నెసఁగి
కాలకూటాంశమున నంధకారమొందు
సుధలహరిఁ బోలి చిత్రమౌ చూపు నెఱపు.

(సవిశ్వాసముగ) ఏల యింకను వయస్యుఁడు తడయుచున్నాఁడు.

ఉ॥ ఈవిషయం బెఱింగి రుమ యెంతయు విఁచంగ నెందయేనిఁ దా
దేవి లతాంగి చేడెలను దిన్నఁగ మోసమొనర్చి నిల్పెనో
యా విమలాంగి ఖేలదిభయానమునన్ ననుఁ జేరదేని నెం
తే వెతఁగాంచు నామన మతీత నవస్పృహలొంది మాటికిన్.

(ప్రవేశించి)

విదూ— కార్యసిద్ధిఁ బడసి యాదృష్టవంతుఁడవై వర్ధిల్లుమన్నావు.

రాజు— (సహర్షముగా నాలింగనమొనర్చి) ఎట్లు?

విదూ— (చెవిలో) ఇట్లు.

రాజు— (ఆనందముగ)

గీ॥ మఱల నిదియె తెలుపుమా నీదుసూక్తులు
రేవెలుంగు తోడ క్రింగునటుల
వెలయు, నాదుమనము. వెలిఁ గోనుఁ జెందఁ?
కాంత మధికరసము గతిఁగ నలము.

(అని సోత్సాహముగ నాకాశమున)

క॥ యామినీ! శతయామవవై
స్వామినివగు, మమృతనిధి! నిశాముఖముల నీ
కౌముదిఁ జొన్పుము! ఆపుమ!
కామ! కఠోరాస్త్ర కర్మ కార్ముక రవముల్.

(గగనముఁజూచి) మిత్రమా! అచటికిఁ బోవు వేళ సమీపించినది. చూడుము,

మ॥ వినువీధిన్ దిరుగాడి డస్సి, కడు దప్పిన్ గన్నవై సూరసూ
తుని కేల్చెమ్మట వార లూడిపడెనాఁ దుషారముల్ లాగ, న
య్యినుఁ డాత్మద్యుతి డింది పశ్చిమకుభృచ్ఛృంగంబునన్ నిల్చె, చ
కృనఁ జొచ్చున్ సరిదీశకూల గతమౌ కాంతార కాంతారముల్.

చ॥ అరుణచరుల్ జనన్ విడిచి యబ్జినిఁ దాఁకఁగ నంటు దూరజో
భరమునఁ దూలు భీతినన భానుఁడు గ్రుంకెడు సాగరంబునన్;
విరహము మించ వేడుకను వెంచఁ బయోజినియున్ బ్రియాంశువం
తరమున నిల్పుకో ముకుళనంబొనరించు నిజాబ్జకోశమున్.

విదూ — ఓయీ! ప్రియవయస్యా! ఆమె యవస్థను నివేదించు నీ విరహలేఖఁ బఠింపుము.

(రాజు చదువును.)

గీ॥ గాలి తెరువులఁ దోడ్తోడఁ గప్పివైచి,
మణి గృహముఁ జొచ్చు నీ జ్యోత్స్న, మడఁతి! కొనుమ
నీలచేలముఁ దాల్చి నిలుమ వంత,
నంతయుఁ గృశించి నిన్నంత నిందుఁడొందు.

చ॥ కలశములుంచుఁడీ వెలికిఁ గౌముది పోవనియట్లు మాటికిన్;
దొలఁగఁగఁ జేయుఁడీ యుడుల, దూరము సారెకు శోధనీతతిన్;

దలఁపకుఁడీ యనంగు నభిచారచరుత్వముఁ, జైకపంచమం
బొలయఁగ వాంఛసేతురెటు లుగ్మలులార! సుఖంబు నాకుఁగన్.

మఱియును,

క॥ నళినోత్పలముల సంఘుల
దళముగ జతురసమిడుండు, దళబంధముగన్
దొలఁచడు పరిమళబంగుం,
డలపధిక స్త్రీలయసువు లనిలుఁడు దీనన్.

క॥ చన్దోయిటి చందనమును
గన్దోయిని బొరలునీరు కడుగఁ గథలఁజెం
పున్దగి, చెలులు నిరామయ
తన్దగునవి గూర్పఁగడపుఁ దారేమెల్లన్.

మఱియు,

చ॥ ఇతఁడగుధూర్తు, కట్టుఁడని యిందుని రశ్మిలెల్లఁగుఁ; జంద్రికా
మృతములు దప్పవోవఁగ, నమితుఁ, విధుంతుదు వేడుమాటికిన్;
మతిఁబురవైరిఁ గొల్చుటకు మానిని వాంఛిలు నుజ్జ్వలాప్తుఁడై
నుతిఁగను మన్మథున్ మఱల నొవ్వఁగఁ జేయుటకై చలంబునన్

విదూ: ఇపుడేమి తలఁచుచున్నావు.

రాజు:- (లేఖను బాగుగావిప్పి) ఎట్లూ, ఇక్కడఁగూడ నక్షరము లున్నవి (చదువును.)

శా॥ "అమ్మా! నీకెవఁడేని మోసమును జేయన్ లేదుగా" యంచు శో
కమ్ముల్ పల్కుటఁజేరి మావసతి, నాకర్ణింపుమా, కాంతునే,
నమ్మా నాక్షీ మొకండు వ్యాధిగలదై యద్దాని మేన్దాఁక, హ
స్తమ్ముల్ కాయలు కాచనట్టిది సఖీ సంతానమందుండునే?

గీ॥ త్వద్విరహభార ముల్లంబుఁ దరిస్తరింప
నిందు సిగ్గైనపనికి నన్నెలత సౌచ్చి
శ్వాసధూమంబు శ్యామలచ్ఛవిఁ గదించు
చితశాల స్మరాగ్ని నచ్చెలికిఁ గొలుపు.

విదూ.- (ముందునకుఁజూచి) ఓయీ! మీ యిర్వురకుఁ జక్రవాక మిథునంబునకుఁబోలి స్నేహము కుదిరినది.

రాజు:- (సస్పృహముగఁజూచి)

మ॥ తన రక్తాబ్జ మనోజ్ఞ చంచుపుటి, నుద్ధారింప వాంఛించు భం
గిని గోకంబు కంఠతఁ గాంచుబడు పంకేజాప్తబింబంబు; నం
తన దీనాననయై స్వకాంత విరహక్రాంతాణార్థినింబోలి క
న్గొన నీటన్ గనుఁ, గోకి, భీతి వలదంచున్ బల్కు నల్లెల్లెడన్.

విదూ.- అహో! గోధన సహస్ర సముద్ధూతమైన నిరంతర ధూళిచేఁ జెంపొందిన తరుణ తిమిరపంక్తి చేలాంఛితమగు సమయమున సంకేతస్థాన మనుసరింపుము.

రాజు.- (పైకిఁజూచి)

చ॥ ఘనతమమొప్పె. ధూపచయ కల్పిత ధూమరుచిన్, నిశాంగనా
ఘనశయనంబు బోలు దివిఁగాంచె నుడుల్ సుమమాలికారమన్;
దనరెఁ దదంతరాన మృగనాభిని దాల్చినటుల్ మృగంబు; సం
జను నెలదాల్చె సిందురము చాఁడిన స్ఫాటికలింగసంపదన్.

రజనీ పరివృఢుండు జరఠతను బూనకమునుపే యీ ప్రదేశము నా దేశింపుము.

విదూ: ప్రియవయస్యా! ఇటు, ఇటు. (ఇట్లిర్వురు పరిక్రమింతురు)

విదూ:- (ముందునకుఁజూచి) ఇదిగో! యిది, ప్రవేశింపుము. గూర్చుందము. (ఇట్లిరువురు సేయుదురు)

రాజు:- ఆహా! సమయమెంత రమ్యము.

గీ॥ సుమగృహంబులు ధూపధూమములఁ బొదలు
నవియె మదనాతురస్త్రీల కాలయములు
ధన్యులకుఁ గంటివెదుటనె దనరుచుండు
సపది హృదయోల్లసద్విలాసములు నిశము.

విదూ:- ఓయీ! మిత్రమా!

చ॥ చిలుకలు దంపతీసురత సీత్కృతముల్ వెలిఁబెట్టునంచు, భీ
తిలి, వెలిరత్నవల్లభిని దేకువఁజేర్చిరి పంజరంబులన్
జెలఁగెఁగపోతజాతము రచించు రుతంబులు సెజ్జలున్నెడన్
మెలఁగె శ్రమాంబు బిందువుల, మెల్లనఁ బాపఁగ నిందుపాదముల్.

రాజు:- (నిట్టూర్చి)

చ॥ దవులవ నాయురాన సురతశ్రమ భామినివ్రాలి కూర్కఁగా
ధవళ నివాసజాలక పదంబుల జారు శశాంకపాదముల్;
దవులవ, వీనులందు సురతంబున మద్భుజ పంజరంబునన్,
దవుల విలాసభాసుర రదచ్ఛదపీడిత తద్గళధ్వనుల్.

రాజు:- (ఇట్లు ఔత్సుక్యముతో)

మ॥ తెలి ముత్యాలసరాల వెల్గుగమి సాంద్రీభూతమైనట్టి వె
న్నెలలో మోము మునుంగ, నంగభవ సందిష్టార్ధ్యమందున్, ముదం
బలరన్ జందన పాండురస్తనము లల్లాడంగఁ బ్రాణేశుపై
నెలమిన్ జూపుత్వరన్ బదంబిడుచు నెంతే లీలలన్ గొల్పెడున్.

మ॥ నవతారుణ్య మసూయఁగాంచు, నవసౌందర్యంబు సిగ్గొందుఁ బ్రే
మవిధానంబును దీటుఁ దాల్పదనుచున్ మన్నించుచున్ భూజనుల్
స్తవముల్ సల్పఁగ వించువింత మరుఁడా చార్వంగిఁ గన్చున్, సతం
బు వహించున్ గడుదైన్యమున్ నగుమొగంబున్ గౌతుకంబున్ వెతన్.

(అంతఁ గర్ణసుందరీ వేషముస దేవియు, వకుళావలీ వేషముస హారలతయుఁ బ్రవేశింతురు.)

దేవి:- సఖి! హారలతా! మన మేదేని వినుచు నిటనుందము.

రాజు:- అహో! యెట్లూ! ప్రాణేశ్వరియే వచ్చె! (ముఖముఁ జూచి) ఆహాహా!

గీ॥ నలువ విస్మృతిఁ గనెనంచుఁ దెలిసికొంటిఁ,
జంద్రబింబంబు లావణ్య సారమున, నొ
నర్చి మృగకాకపదకంబుఁ గూర్చియుందు,
నాయతాక్షము, నీమోము, నబల! తీర్చె.

విదూ:- నేనును వర్ణింతును.

చ॥ సురతసమి ద్విరోధమున సూరెలనూరెడు రోహిణీదృశా
సరసిజ కజ్జలాశ్రువుల సంగతి నానలుపంది కందు చే
వరలు నిశాకరుండొడిని బట్టుచు లాలన సేయునట్లు సుం
దర నిజవక్త్రసన్నిభముఁ దావహింపుచుఁ దిరనామ డింభముల్.

దేవి:- హతాశా! ఇదియెల్లయు నీ దుడుకుఁదనమే.

రాజు:- సఖీ! వకుళావళీ! మీసఖికేల యీవామత! ఆలోకన మాత్రముననైన మమ్ములఁ గృతార్థులఁ జేయదేల?

హార:- ఈ విషయమున స్నేహమే యపరాధము సేయుచున్నదిగాని వామత గాదు.

రాజు:-

గీ॥ సిగ్గుచే నెగ్గుఁగని తొగల్ సెందుఁగాత
కపటనిద్రను వెన్నెలన్ గదిసియేనిఁ
బూల విలువాఁడు లీలలో నోలలాఁడు
నట్టి నీచూడ్కి నాకేక రాక్షి! కనుమ.

మఱియు,

గీ॥ తన్వి! త్రిపంచ్యజింపు, త్వరఁ బల్కరింపుమా
వీణె పంచమంబు వీనులలముఁ,
గాఁగిలింపు నన్ను గాఢముగాఁ జాన!
కూర్మిరమ్మ్యో నారి జారికాంతి.

(అని నిలఁ వెల్లఁజూచి తనలో) అహో! యేమి యీ నిస్సీమ రామణీయకము.

గీ॥ భ్రూవిలాస మతను పూశల్లును జయించు,
నయనవృత్తి యందు, జయశితత్వ,
మంబుజాక్షీ చిబుకమంటు పయోధర
కలశయుగముగాంచు ఘనతమృదుత.

(అని కౌగిలించును.)

దేవి:-(వెల్లడియై) ఆర్యపుత్రునకు స్వాగతము. (అని యొరగును)

రాజు:- (సవైలక్ష్యముగ)

క॥ తనచేసినతప్పు నెఱిం
గినవానికి వ్రీడఁబొడము నెఱిబుద్ధి, చెలీ!
జనియించె నిపుడుమాకుఁ
ఘన వైలక్ష్యంబు తోడుగా మదికలఁగన్.

(విదూషకుఁడు రాజుపక్షమున నధోముఖుఁడై యుండును.)

చ॥ తలఁచెద వెట్లు నర్మమును దాలిమిచేసితినంచు, నేను ద
ప్పులు గలవాఁడఁగాననుచుఁ బూనివచించెదఁ, దప్పుఁజూడఁగా
వలనగునెట్టు? లంతయును బాసి క్షమింపుమ! నన్ను నేలుమా!
వలనగు నాకునెద్ది యదిపల్కుమ! యానగ దేవి! చేసెదన్.

(అని పాదములపైఁ బడఁబోవును.)

విదూ:- ఓయీ! యేల యీ యరణ్యరోదనము చేసెదవు. దేవినే యనుసరింపుము.

రాజు:- అట్లే యగుఁగాక! (అందఱు నిష్క్రమింతురు)

తృతీయాంకము సంపూర్ణము.

# చతుర్థాంకము

(నేపథ్యమున)

దేవరకుఁ బ్రభాతసంధ్యయు వంద్య యగుఁగాత! ఇపుడు,

గీ॥ తరణి తురగఖురక్షుణ్ణ ధాతుభూజ
రజముచేనాఁగఁ బూర్వాశ ప్రభవహించె;
నపరసాగర వేలాజ మైనఫేన
పిండపుంభ్రాంతిఁ బడమర, విధుఁడు గ్రాలె.

ఉ॥ చందురుఁజూచు రాగమున శార్వరినెల్ల బ్రజాగరంబుతో
వందురినట్లు మంచు మల వాయువు చెల్మిని గల్వతీగ గూ
ర్కొందు; నళుల్ ప్రబోధమొనఁగూడఁ, బ్రభాత విలాసగీతముల్
విందుగఁ బాడు నాఁగఁ గదలెఁ గలనాదతఁ దమ్మిబావులన్

మఱియు,

చ॥ సురత వినోదసాక్షులయి చూపఱు లత్తుకయంటులంటఁ బా
వురములు సోలి తల్పములఁ బొంపిరిఁ గూర్కఁగనుక్; రతిక్రియా
పరుల వినోదముల్ గుర్తులపజ్జ శుకంబులు పల్కఁ, వానిచేఁ
దరుణులు దుస్తరక్రియలఁ దాఁగణియింత్రు సుసాధముల్ వలెన్.

(అంత విదూషకుఁడు ప్రవేశించును.)

విదూ:- (సపరితోషముగ) మేలు, అమాత్యా! మేలు. కర్ణసుందరీ సమాన వయస్కుఁడగు దేవి చెల్లెలికుమారునిఁ గర్ణసుందరీ వేషధారిని సీతాశ్వునకుఁ దెప్పించి యతని వాసమునఁ గర్ణసుందరిని విడిచిన నీచే సర్వము సాధింపఁబడియె. ప్రియవయస్యుని చక్రవర్తిభావము సర్వథా అభిముఖమైనది. మఱియు దేవివలని పరిహాసముచేత మహానుభావుఁ డిప్పుడు రక్షింపఁబడియె. మందభాగధేయుఁడనగు నా

పెడబుద్ధిచేఁ గర్ణసుందరీ వేషము ధరించిన దేవి చెల్లెలి కుమారునిఁ బెండ్లియొనర్చుకొనుటకుఁ బ్రియవయస్యుఁడు సిద్ధపడియెను. ఇపుడు దేవియే ఏలిక కాఁగలదు. కనుక నా దుస్సహ సంగతనివాసుఁడగు నార్యపుత్త్రుఁ జేరఁజనియెద. (అని నిష్క్రమించును)

(అంత రాజును విదూషకుఁడును బ్రవేశించుచున్నారు.)

రాజు:—

శా॥ ఫాలస్థాంబక కీలికీలకిసల ప్రాచుర్య శయ్యాస్థలిన్
నాళీకాస్త్రిని నిద్రలోఁ జొనుపు కందర్పారిపాంథాళికిన్
జాలన్ హానినొనర్చె; మర్మములు వేచక వజ్రసారంబులౌ
కోలల్ గొండొకమన్మథుండు గురియున్ గ్రూరంబుగా మాటికిన్

మఱియును,

ఉ॥ ప్రేమకు లోటుగా నపరవీథి దృగంబులు జారఁజూడఁ: భ్రూ
సీమల తాండవంబరయఁ, జిత్రము తద్విపరీతపక్ష్మసేన్,
గాము విలాసముల్ ముగియఁగాఁ గనుమోడ్పున మారుస్రుడుల్ వినక
నోమ; విపర్యయంబుగఁ గనుంగొన నా విధిచేష్ట మిక్కిలిన్

విదూ:- ఆహా! ఇంక నిప్పుడును బరితపించుచున్నావేల? పిశునుల ముఖమున మసిఁబూసి మనోరథము నెఱవేర్చికొనినట్లేకదా.

చ॥ వలనుగ దిష్టమాపినను, బైదలిఁ గాంచుట నా మనంబులోఁ
గలుగదు నమ్మకంబు, తనకౌఁగిట నిష్టజనంబు చిక్కియున్
దలఁపులు మిన్నులన్ బొరలు, దానఁ ద్రుటిక్ దలపంగనోను, ద
వ్వుల మఱలన్ దనున్ గదియఁ బొల్తుక దొర్తరుదెంచునట్లు గాన్.

(నేపథ్యమున)

మహారాజునకు గ్రీష్మసమయము సుఖముఁ గూర్చుఁగాత. ఇపుడు

చ॥ మునుపుఁ బరీక్షసత్సలిలముల్ దమమన్కలఁదాల్పు త్వద్వియో
జనవరయాపతంబు వని దప్పిఁగలంగి, నడల్ బెడంగుగాఁ,
గనెదరు, బాష్పబిందుతత గండతల బులకోద్గమ, వెక్కచున్,
స్తనయుగళీ తటంబువయిఁ దావగు నాణెపుఁ దారహారమున్.

రాజుః- (సోత్కంఠముగ)

ఉ॥ మందిరకోలంబుసుందరి యమందగతిన్ రతిలోలచిత్తమై
సంచిత పూర్ణసత్క్రియుని పొందుపటీర ప్రమత్కసంచయా
భ్యంచిత సుందరత్వ కలితాంక తలస్థితుఁ జేసి వేగఁ దే
లించు సుఖోర్మికావలి లలిన్ దినమధ్యముసంద యాతనిన్.

మఱియు,

చ॥ తములము తేమ వాసినను దప్పదు స్వచ్ఛవి మోవి, తీవి నే
త్రము పెనుచుల్ బహుఃపటల ధౌతము కజ్జలమయ్యెఁ, గేశబం
ధము విగళత్కణంబగుచుఁ దాల్చె నమందరసంబొకండు, చం
ద్రముఖికి స్నానమాడఁగనె, దర్పకుమేటి శరంబు పాటియే.

(సౌత్సుక్యముగ)

మ॥ కదళీస్తంభ నిభాభిరామ సహజ గాత్రోహర్యోరు యుగ్మోన్నతుల్,
మృదు కృష్ణాగురు ధూపితస్నపనవారి పార్ద్రకేశంబులున్,
విదితాకైతవ శీతల స్తనతటుల్. పెంపైన మేన్కాంతి, ఘ
ర్మదవాతప్త మనోజు జీవనముల౯ రక్షింప మంద య్యెడన్.

ఇంకను దేవి యాహ్వానము కాకున్న దేల?

విదూః— ఓయీ! త్వరపడకుము. ఇది పరిహాసమని దేవికి గొప్ప యభినివేశము.

(ప్రవేశించి)

చేటిః- ప్రభువునకు జయమగుఁగాత. వివాహ యోగ్యములగు నీ యాభరణములు దేవిచేఁ బంపఁబడెను. వీని నలంకరించుకొని వివాహభూమిని భూషింపుము. (అని యాభరణముల సమర్పించును.)

రాజు:- ఇది నీవు కైకొనుము. నేను వచ్చితినని దేవికి నివేదింపుము. (అని కంఠమునుండి తీసి ముక్తాహారము సమర్పించును. చేటి కొని నిష్క్రమించును.)

రాజు:- (తన యలంకారములు విదూషకున కొసఁగి నాట్యమున తన్నలంకరించుకొనును.) నిట్టూర్చి

మ॥ తన యత్యంచల చుంబిపల్లవ మహత్త్వాంబంగజాతున్ రతీ
వనితాంకస్థితు నేఁ ద్రిలోకము భరింపన్ జేయు గంధేభగా
మిని వైవాహిక హోమధూమకలనా మీలత్కపోలాస్యమేఁ
గనుఁగోనా, త్రిపారసాతిశయ సంక్రాంతిన్ నతంబైనటుల్.

విదూ:- వివాహవిధి నగ్ని పరిజ్వలనమైనను జేసెదవా? దేవి యెట్లు సమర్పించునో అటుల గ్రహింపుము.

(నేపథ్యమున)

మ॥ చెలఁగన్ మంగళగానముల్ చతురతా శ్రీదోఁచుతన్ లాసికా
కుల నృత్యంబులు, బాహ్యకక్షుల నృపుల్ గుంపై వతిన్ గొల్చుతన్
లలి స్వఃకాంతలు పూజడిన్ విడుతఁ, గల్యాణస్థలిన్ బెండ్లికై
మెలనవ్వారఁగ దేవి చేరుత, నిజాధీశాత్మ కాంతాదృతిన్.

విదూ:- ఓయీ! దేవి వంచింపఁబడెనని నిస్సందేహముగ నెఱుంగుము. రమ్ము! త్వరితముగఁ బోయెదము. ఇటు, ఇటు.

(ఇర్వురుఁ బరిక్రమించుచున్నారు.)

(అంత దేవియుఁ జేటియుఁ బ్రవేశింతురు. విభవముతోఁ బరివారమున)

దేవి:- సఖీ! హారలతా! ఆర్యపుత్రుని విప్రలంభము పర్యాప్తమయినది. (అని ముందుఁజూచి) ఇదిగో! విప్రవిటునితో భర్త వచ్చెను. (అని చాటుగ నిర్వురు నిలుతురు.)

విదూ:- ఇదిగో! దేవి సమీపింపుము. )అనియట్లిరువురు చేతురు)

దేవి:- (లేచి) ఆర్యపుత్రునకు జయమగుఁగాక. (అందఱు యథోచితముగాఁ గూర్చుందురు.)

దేవి:- (అంజలి బద్ధయై) నేను విరుద్ధము నాచరించిన దానికి శిక్షగాఁ గర్ణసుందరిని సమర్పించుచున్నాను.

రాజు:- మహానుభావ స్వభావురాలవు. నీకెద్ది యిష్టమో దానిని జేయుము.

(ప్రవేశించి)

ప్రతీహారి:- అమాత్యుఁడు ద్వారమున నున్నాఁడు.

రాజు:- త్వరగాఁ బ్రవేశపెట్టుము. (ప్రతీహారి నిష్క్రమించును)

(అంత నమాత్యుఁడును బ్రతీహారియుఁ బ్రవేశింతురు.)

ప్రతీహారి:- ఇదిగో! భర్త. అమాత్యుఁడు సమీపించుఁగాత.

(అమాత్యుఁడు యథోచితముగా నుపసర్పించును.)

రాజు:- ఆసనమాసనము! (ప్రతీహారి యాసనముంచి పోవును)

దేవి:- సఖీ! కర్ణసుందరిని దెమ్ము. అమాత్యునెదుట సమర్పించి నిరపరాధురాల నగుదును.

చేటి:-నవవధువని యవనికాంతరమున నేయామె యుంపఁబడెను. (అని పోయి యామెనుగొని ప్రవేశించి) దేవీ! ఈమెను సమర్పింపుము.

దేవి:- (సలజ్జయగు నాయిక నంతికమున నుంచి, తనలో) ప్రత్యక్షముగా నామెయే యీమె. ఆహా! యీ కపటనాటక మాహాత్మ్యము.

రాజు:-

శా॥ మాంజిష్ఠచ్ఛవిమోవి, మోము శశిధామచ్ఛన్నమౌ, భ్రూయుగం
బుం జూతాస్త్రశరంబుఁ బూర్ణముగఁ గప్పున్, హేమకుంభప్రభా

పుంజంబుల్ జనుదోయి సోఁకు నియతంబున్ సేయు, నచ్ఛోత్పలం
పుం జాయల్ గడకంటికాంతి కడుఁ దావ్రుల్ నిక్కమూహింపఁగన్

(మిక్కిలి నవ్వి)

గీ॥ నైజతరళదేవి నాచూపువంచింపఁ
జంచలాక్షితోడ సమతఁగోరుఁ
గొఱఁతలేకయున్న, కోమలి సమసృష్టి
సృష్టికేని శక్తి చాలకున్న.

దేవి- ఈమెను నీకు సమర్పించితిని చతుస్సముద్ర ముద్రిత భూరత్నమైన యీామెను భజింపుము. (అని తత్కరమున నాయిక చేయి యుంచును.)

రాజు- (కైకొని) దేవిచే ననుగ్రహింపఁబడెను.

దేవి- అమాత్యా! యుక్త మొనర్పఁబడెను.

అమాత్యుఁడు- ఏమి చెప్పితివి.

చ॥ తమకులమందు మౌక్తిక వితాన సమచ్ఛవి పుట్టి యిచ్చఁగాఁ
దమ కులకీర్తి మేరువసుధాధరవతుముఁ గ్రుచ్చి పేర్చఁగాఁ
దమ యువనీశతన్ జలధి తల్పమునన్ హరి సేద దేఱఁగా
నమరు చళుక్యరాజుల గృహంబునకున్ వధువైతి విమ్మలన్.

విదూ- వివాహముజరిగెను. ఇపుడు స్వస్తివాచనమునకవసరము.

దేవి- (స్వగతము) హతాశుఁడా! వివాహముఁ జూతువుగాక.

గీ॥ కనకపుంఖాస్త్రచయ మసంఖ్య మగుఁగాత
అమ్ము జయలక్ష్మి కర్మఠంబగుత; మదన!
ప్రియజనంబుల నెడఁబాయు వెతయడఁగుట
సహచరుల కొక్కచాయ యా సౌఖ్యమగుత.

అమాత్యుఁడు- (ఆత్మగతము) వెల్లడికిది యవసరము. (ప్రకాశముగ) ఎవఁడక్కడ?

(ప్రవేశించి)

ప్రతీహారి- అమాత్యుఁ డానతి యిచ్చుఁగాత.

అమాత్యుఁడు- దేవి భాగినేయుఁడగు కుమారుని వేడుకకై తెచ్చితి తనయింట బంధుసహితుఁడై యుండెనా లేఁడా కనుఁగొనుము.

ప్రతీహారి- ఇపుడే యిటు తిరుగుచుండగాఁ జూచితిని. (అని పోయెను.)

దేవి- (ఆత్మగతమున) హా! చెడితిని! మందభాగ్యురాలను. ఇది కైతవమని ప్రత్యక్షముగా నామెయే యీమెయని నుడివితిని. వంచింపఁబడితిని. ఏమిసేయుదును (ధైర్య మవలంబించును.)

(ప్రవేశించి)

ప్రతీహారి- గర్జన నగరము జయించుటకేగిన రుచ్చికునినుండి ప్రధానుఁడగు వీరసింహుఁడు వచ్చుచున్నాఁడు.

రాజు- త్వరగాఁ బ్రవేశపెట్టుము.

(ప్రతీహారి నిష్క్రమించి వీరసింహునితోఁ బ్రవేశించును,)

వీర- సామ్రాజ్య యుక్తుఁడగు దేవరకు జయమగుఁగాత.

అమా- ఆసనము.

రాజు- వీరసింహా! వృత్తాంత మేమి? తెలుపుము.

వీర- మనబలము సింధుతీరమున గర్జన నగరాధిపతి సైన్యముతో గవిసిన సంగతి దేవరకు నివేదింపబడియే యుండెను. పిదప గొప్ప సమ్మర్దము కాఁగా.

చ॥ కలయఁ గులాద్రులెల్లఁ గడుఁ గప్పఁగఁ గోరికఁబూని సూదియున్
దాలఁచఁగ రాక పాఱు పెనుదుమ్మున వ్యోమరంధ్రమయ్యె; వీ
రుల కడు రాకపోకలను రూపడ ధారుణీ మండలంబు ద్వా
రలసిత లక్ష్మినై సవివరంబగుచుండెను వీరులేగినన్.

తరువాత,

ఉ॥ ఏలర దోర్బలంబు, విలునెక్కిడు, మేఁ బ్రహరింప, సాధ్వసం
బేలర, నేను బ్రాక్ప్రహరణేచ్ఛుఁడ, వే రథమెక్కి కొట్టుమా
యీలలి వీరులెల్ల వటయించు నుదార ముదావహోక్తులన్
హాళి సురాంగనల్ వినిరి యభ్ర రథంబుల మోము వ్రాల్చుచున్.

రాజు- తరువాత?

వీర- క్రమముగా,

శా॥ నీరంధ్రంబుగ ప్రాడినీరుచుల నిండెన్ వ్యోమరంధ్రంబు పెన్
దూరంబైకనెఁ, ద్రాసతామ్యదిన సప్తుల్ శస్త్రజాతంబులన్
గ్రూరాసిత్రుటి తారివీరవరణా రూఢోద్యమ స్వర్వధూ
వారంబేనియు వీలఁగాంచద ధరాభాగంబుఁ జేరంగరాన్.

(దేవి నవ్వును.)

విదూ- ఉత్కంఠితుఁడ నగుచున్నాను.

రాజు- తరువాత?

వీర-

సీ॥ మింటికెగయు కబంధముల్ మీఁదఁబడుటఁ
గారు రక్తంబుతో గుహ్యక క్షితీధ్ర
మెదుటఁ జూచుచు సురసరో జేక్షణాలి
కిన్నర కులక్షయా శంకఁ గిడుపడియె.

మఱియు,

ఉ॥ కమ్మఁగఁ బాడు నచ్చరల కమ్మని వాసనగల్గు మోములన్
బమ్మెదు నూర్పులం జెలఁగు వంశవిజిత్స్వర భృంగనిస్వనం
బిమ్ముగ గనంగ, నాజి, రిపు బృందకబంధములాడ సేవలం
గ్రమ్మెను ధీరమై కరటి గర్జనమే మురజారవంబుగా.

రాజు- తర్వాత?

వీర- సుర లాశ్చర్యపడునంత కర్మ రుచికుఁడే చేసెను.

రాజు- పిదప,

వీర-

చ॥ జనవర నెమ్మనిన్ వలయ చారుతరారవ ముల్లసిల్ల స్వ
ర్వనితలు కౌఁగిటం బొదువఁ బట్టెను కంఠము గల్గఁజేయుచున్
దనరితి, భూరి రత్నజనితద్యుతి విచ్ఛురితాబ్ధి నూలుగా
నెనసిన ధారుణీస్థలికి నీశుఁడవై యిపుడీవు ప్రోడవై

(అందఱు సంతసింతురు. విదూషకుఁడు నృత్యము చేయును.)

అమాత్యుఁడు- ఇక నీకిట్టిప్రియ మువకరింతును.

రాజు-

మ॥ భువనాశ్చర్యకరంబు దేవి మహిమంబుం జూడనయ్యెం మనో
భవ భూమీరమవోలెఁ బత్నులదృశా వర్యంబు పాలించె, నీ
యవనీ మండలమెల్లఁగూడె నిటు లేకైకా తపత్రింబుగా
మివులం గల్గినదేది నిన్నడుగఁగా మేలౌ ప్రియంబొండగుం.

అయిన నిట్లగుఁగాక.

ఉ॥ హేల గడించు శాస్త్రములనేను నేర్పరి, సాహితీసరి
త్పాలుఁడు వాదకేళి జితపండితుఁడుజ్జ్వలి నీలసద్వచో
లోలుఁడు సత్కృతిన్ దినములోనె రచింపగలట్టివాఁడు, ధీ
శాలి, విదగ్ధుఁ డార్యజనసన్నుతుఁడౌ కవినిల్పుఁ జెంగట౯.

(అని యందఱు నిష్క్రమింతురు.)

చతుర్థాంకము సంపూర్ణము.

గద్య :

ఇది శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర కరుణా కటాక్షలబ్ధ సరసకవితా విలాస
లాలితులును, వనపర్తి సంస్థానాస్థాన కవివరులును గౌశిక
కౌండిన్య గోత్రోద్భవులును, "ఆంధ్ర బిల్హణ" బిరుదాం
చితులును నగు కప్పగంతుల లక్ష్మణ మాదిరాజు
విశ్వనాథ కవియుగముచే ననువదింపఁ బడిన
బిల్హణు కర్ణసుందరీ నాటికయందుఁ
జతుర్థాంకంబు సర్వంబు
సంపూర్ణంబు.

---

## గ్రంథకర్త ప్రశస్తి.

మ॥ నెలపూఁదాలుపు సా మెయిన్ గను భవానీదేవి, యెవ్వాని యా
దల నిల్చెన్ శ్రుతిశీర్ష సంకలిత శబ్దబ్రహ్మ యాదేశముల్
తెలుపా పేతమనీషి, యార్యహిత సంకల్పుండు శ్రీ బిల్హణుం
డిల నీకావ్యమునిల్పె సజ్జనము లెంతే సంస్తుతుల్ చేయఁగన్.

మ॥ భగవంతుండు కృపాళుఁ డాదికవియౌ వాల్మీకి మూలంబుగాఁ
దగి, ద్వైపాయన ముఖ్య సత్కవులు తద్దన్ బెంపు సేయన్, గవీ
శ గురుండైతగు కాళిదాసు సువచస్సన్మార్గమందుండి యి
ష్టగనైన్ బిల్హణ కల్పశాఖి ఫలముల్ పుష్పంబు లవ్యాజతన్.

చ॥ కడ •ధుమువుల్• గలట్టి నుడిగర్తగ, "నిన్ను"లు గల్గఁ గర్మగాఁ
బడయు క్రమానుశిక్ష గలవారికి మోక్షు; సుకావ్యశాణి రా
పిడిఁ గనుటన్ గళంకెడల పెంపగు వాక్కులన్ రచించి పే
ర్వడయు కవీశ్వరాళికయి వ్రాసెను బిల్హణుఁడీ మహాకృతిన్.

క॥ అమల కవితలీలలు కుం
కుమకేసర వితతులేక కుక్షిజములగున్
సుమహితము శారదాదే
శమువిడి వేఱెడఁ దదుల్లసనమే నెఱుఁగన్.

శ్రీనివాసా ప్రింటింగ్ వర్క్సు, శికిందాబాద్.

# తప్పొప్పుల పట్టిక

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 3 | ధర్మవమా | ధర్మమా |
| 1 | లంబునిల | లంబుగనిల |
| 15 | = | పాఠాంతరము |
| 19 | పరాఙ్ముత | పరాఙ్ముఖత |
| 5 | సంరంభ | సంబంధ |
| 22 | ఁబంప | ... |
| 21 | హృట | హృష్ట |
| 6 | చడ | చండ |
| 22 | కుత్త | సుత్త |
| 10 | చతుస్స్యా | చతురస్స్యా |
| 10 | జేయ లేరు | జేయ లేదు |
| 13 | గోడ | గోద |
| 6 | = | పాఠాంతరము |
| 6 | త్ఛ | త్ఖ |
| 23 | హనువువలె | హనుసువలె |
| 7 | ; | ... |
| 12 | పాదమునెన్నన్ గాంతి విస్ఫూర్తి | పాడముఁగాంతి- స్ఫూర్తి నెన్నని |
| 14 | దహించు | రహించు |
| 7 | బ్రాహ్మణ | బ్రాహ్మణి |
| 17 | నమ్ముఖ | సమ్ముఖ |
| 21 | గంటి | గంట |
| 9 | బల్కి | బల్క |
| 17 | దేవకులములేనియిచట | దేవుఁడులేని కోవెల యగు నిచట |

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 31 | 23 | వేఱు | వేసి |
| 32 | 13 | మందు | మిందు |
| 33 | 20 | కూర్చుందు | కూర్చుండు |
| 38 | 6 | గూర్పు | నూర్పు |
| 39 | 11 | నీదుపరిజనమున నొకం డేను | నీ పరిజనమున నొ- కండ నేను |
| 40 | 13 | స్పదమయియున్న దేనొ | స్పదమిదిమొల్ల నేనొ |
| 42 | 11 | సా, వసతి | సావి సలి |
| 47 | 5 | లు నిశము | ప్రసిశము |
| 53 | 20 | పరివారమున | పరివారమును |
| 58 | 7 | రుచికుండు | రుచ్చికుండు |
| ,, | 10 | నెమ్మినిన్ | గర్జనన్ |
| 59 | 1 | నెను | నెల్లను |